LONGEST LIVING NEWSPAPER IN TELUGU JOURNALISM
Visit Internet Edition @ www.zaminryot.com "e-mail : editor@zaminryot.com"

# జమీన్ రైతు



స్థాపకుడు : నెల్లూరు వెంకట్రామానాయుడు | సంపుటి : 71 | సంచిక : 35 | 1.9.2000 | శుక్రవారం | 12 పేజీలు | విడిప్రతి : రూ.2.00లు | జీవప్రదాత : నెల్లూరు శ్రీరామమూర్తి

# రాజధానిలో రక్తం మడుగులు కట్టింది!

ప్రజాదరణ కల్గిన రాజకీయ వాదిగా ప్రపంచ దేశాల ప్రశంసలు అందుకొన్న ముఖ్యమంత్రి చంద్రబాబు ప్రజాగ్రహాన్ని తట్టుకోలేక రాజధాని నగర వీధులలో నెత్తుటి ఏరులు పారించాడు; స్వర్ణాంధ్ర ప్రదేశ్ చరిత్ర పుస్తకంలో ఒక పుట రక్తపు మరకలతో మలినమై పోయింది; మేమీ ధరల భారం భరించలేము బాబు అని మొరపెట్టుకోవడానికి భాగ్యనగరానికి వచ్చిన సామాన్య ప్రజానీకాన్ని రక్తపు మడుగుల్లో ముంచి వినోదించింది రాక్షస ప్రభుత్వం.

శాసన సభకు కూతవేటు దూరంలో, యావత్ ప్రభుత్వ యంత్రాంగం సమక్షంలో, కొన్ని లక్షల మంది ప్రజలు టివి ఛానళ్ల ద్వారా గుడ్లప్పగించి చూస్తుండగా పోలీసులు నరమేధం నిర్వహించారు. ఘోరమైన మారణకాండ జరిపించారు. లైసెన్స్ కల్గిన కిల్లర్ల వలె వ్యవహరించారు. ఆనాటి దృశ్యాలు రాష్ట్ర ప్రజలందరి మనస్సులలో ఒక పీడ కల వలె చాలా కాలం నిల్చిపోతాయి. ప్రదర్శనకారులు రెచ్చగొట్టడం వల్ల; రాళ్లను రువ్వడం వల్ల; ఒక జీపు తగలబెట్టి, మరొక పెట్రోల్ బంకుకు నిప్పంటించడానికి ప్రయత్నించడం వల్ల తమ పోలీసులు కాల్పులు జరపవల్సి వచ్చిందని; జనంపైకి చల్లడానికి తెచ్చిన నీళ్లు, బాష్పవాయు గోళాలు పూర్తిగా అయిపోయినందువల్లనే తుపాకులకు పని చెప్పామని ముఖ్యమంత్రి శాసనసభలో తన హోం మంత్రి చేత ప్రకటన చేయించారు. కాని ఆనాటి దృశ్యాలను యావత్ ఆంధ్రదేశం తిలకించింది. అక్కడ ఏమి జరిగింది రెండు కళ్లతో చూసింది. అందువల్ల ముఖ్యమంత్రి నిజం చెప్పాడా, అసత్య ప్రచారం చేస్తున్నాడా అన్న విమర్శ పత్రికలలో చేయవల్సిన అవసరం లేదు. ఆంధ్ర ప్రజలు అజ్ఞానులు కారు. ఇక్కడ సమస్య ముఖ్యమంత్రి ఏమి చెప్పాడు అన్నది కాదు; ఏమి చెప్పకుండా తప్పించుకుంటున్నాడు అన్నదే ముఖ్యం. ఈ సంఘటనలపై శాసనసభ లోపల, బయట ప్రతిపక్ష నేతలు, స్వంత పార్టీ నాయకులు, ప్రజా సంఘాలు పలు ప్రశ్నలు వేశాయి. కానీ ఒక్కదానికి ప్రభుత్వం నుంచి సమాధానం లేదు.


హైదరాబాద్‌లో పోలీసు కాల్పులకు ప్రాణాలొదిలిన అభాగ్యుడు; బషీర్‌బాగ్ ఫ్లై ఓవర్‌పై నిల్చొనివున్న ప్రజలను కాల్చను తుపాకి ఎక్కుపెట్టిన పోలీసు కళ్లకుకట్టినట్లు కన్పిస్తున్నారు.

ఈ ప్రశ్నలలో ప్రధానమైనది కాల్పులు జరపవల్సిన అవసరం ఎందుకు వచ్చింది. నిబంధనల ప్రకారం జనం కాళ్లమీద కాకుండా నేరుగా గుండెకు గురిపెట్టి ఎందుకు కాల్చారు అన్నది. దానికి సమాధానం చెప్పకుండా ప్రదర్శనకారులలో తీవ్రవాదులు వున్నారని, వారు ఆయుధాలు ధరించి వచ్చి పోలీసుపై దాడి చేశారని మాట్లాడుతున్నారు ముఖ్యమంత్రి. కాని ఒక్క ప్రదర్శన కారుడి దగ్గర కూడా

## ఎమర్జెన్సీలో కూడ ఇంత దారుణానికి ఒడికట్ట లేదు!

కనీసం చేతి కర్ర వున్నట్లు సైతం పోలీసు నిరూపించలేక పోయింది. వచ్చిన వారందరూ నిరాయుధులే. మొదట లాఠీ ఛార్జి జరిగింది బషీర్‌బాగ్ ఫ్లైఓవర్ దగ్గర. దానికి అసెంబ్లీ ముఖ ద్వారానికి మధ్య ఐదు చోట్ల ముళ్లకంచెలతో బారికేడ్లు పెట్టారు. కొందరు సిపిఎం మహిళలు మొదటి బారికేడ్‌ను దాటడానికి ప్రయత్నించినప్పుడు పోలీసులు వారి మీద లాఠీలతో చావబాదారు. ముళ్ల కంచెల లోపలకు తొక్కి, రవికలు చింపి జుట్టుపట్టుకొని ఈడ్చి పాశవికంగా ప్రవర్తించారు. ఒళ్లంతా నెత్తుటి గాయాలు అయినాయి ఆ మహిళలకు. ఫ్లైఓవర్ మీదుగా జగజ్జీవన్ రామ్ విగ్రహం వద్దకు వెళ్తుండిన తతిమా ప్రదర్శనకారులు ఆ సన్నివేశం చూసి ఆగ్రహంతో ఫ్లైఓవర్ దిగి వచ్చారు; పోలీసు మీద రాళ్ళ వరం కురిపించారు. అప్పుడక్కడ దాదాపు ఆరేడు వందల మంది పోలీసులున్నారు. వారు కొంచెం సంయమనంతో వ్యవహరించి లాఠీ ఛార్జి చేసి వుండినా పరిస్థితి అదుపులోకి వచ్చేది. కాని పోలీసులు నేరుగా తుపాకులు ఎక్కుపెట్టారు; గుర్రాల మీద వెళ్లి జనాన్ని తొక్కించారు. ఈ ప్రదర్శన హింసాయుతం కావడానికి ప్రేరణ జరిగింది ఇక్కడే.

కొందరు పోలీసులు తమకు ఎదురుగా వున్న జనంపైకి తుపాకులు పేలిస్తే, మరికొందరు ఫ్లైఓవర్ పైకి వెళ్తుండిన వారిపైకి గురిచూసి కాల్చారు. దానితో మొత్తం సన్నివేశం గందరగోళంగా మారిపోయింది. మహిళలను చావబాదుతుండిన పోలీసులకు అడ్డుపోయిన ఒక యువకుడికి పోలీసులు తుపాకి చూపించి బెదిరించారు; కాలుస్తారా, కాల్చండి చూద్దాం అన్నాడా యువకుడు. అంతే ఒక అధికారి అతడి గుండెకు తుపాకి ఆనించి కాల్చిపారేశాడు. తుపాకి గుండు తగిలి క్రింద పడిపోయిన తమ సహచరులను తీసుకవెళ్లడానికి వచ్చిన వారిని కూడా కాల్చారు. రోడ్డు పొడుగునా రక్తపు మడుగులే; ప్రతి మడుగులోను ఒకరు, ఇద్దరు క్షతగాత్రులే. వారు చచ్చారో, బ్రతికివున్నారో ఎవరికీ అర్థం కాలేదు. పోలీసు అసలు పట్టించుకోలేదు. క్రిందపడిన వారిని ఆస్పత్రికి తీసుకవెళ్లాలన్న జ్ఞానం కూడా లేకపోయింది వారికి. ఆ రక్తపు మడుగులు చూసిన జనానికి కోపం కట్టలు తెంచుకున్నది; పోలీసులపైకి రాళ్లు విసిరారు; ఒకటి, రెండు వాహనాలు తగులబెట్టారు.

అప్పుడు ప్రవేశించింది వాటర్ కానన్ వాహనం. ఆ నీళ్లు కూడా ఎర్రగా వుండినాయి. అందులో ఏ రసాయనం కలిపారో తెలియదు. ఆ నీళ్లపైన బడిన

తొరవ 12వ పేజీలో

## ప్రసారం నిల్పమని ప్రాధేయపడ్డారు!

28తేది మధ్యాహ్నం బషీర్‌బాగ్ ఫ్లైఓవర్ సమీపంలో పోలీసులకు, ప్రదర్శనకారులకు మధ్య జరిగిన యుద్ధాన్ని సిటి కేబుల్, తేజ టివి ఛానళ్లు ప్రత్యక్ష ప్రసారం చేశాయి. పోలీసులు నేరుగా జనం మీదకు ఎక్కుపెట్టి తుపాకులు పేల్చడం, ముళ్ల కంచెలలో జనాన్ని పడద్రోసి లాఠీలతో చావ బాదడం వంటి సన్నివేశాలు టివిలలో కళ్లకు కట్టినట్లు ప్రసారం కావడంతో రాష్ట్రమంతా ఉద్రిక్త వాతావరణం ఏర్పడింది. ప్రజలు వీటన్నింటిని చూస్తే ప్రభుత్వం పట్ల ఏహ్యభావం కల్గుతుందని భయపడిన ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు తేజ టివి అధికారులకు ఫోన్‌చేసి, ప్రత్యక్ష ప్రసారం నిల్పమని ఆదేశం జారీ చేశారు. కాని వారు అందుకు అంగీకరించలేదు. దానితో ఆయన

తొరవ 12వ పేజీలో

## స్పీకర్ సిగ్గుపడాలి!

ఎమ్మెల్యే క్వార్టర్లు స్పీకర్ ఆధీనంలో వుంటాయి. వాటిలోకి పోలీసులు కాని, ఇతర ప్రభుత్వ అధికారులు కాని ప్రవేశించాలంటే స్పీకర్ అనుమతి తప్పనిసరి. కాని మొన్న 28తేది దాదాపు వంద మంది నగర పోలీసులు ఓల్డ్ ఎమ్మెల్యే క్వార్టర్లలోకి దూరి, నిరాహార దీక్ష శిబిరం దగ్గర వుండిన వారినందరినీ చితక కొట్టారు. కొందరు ఎమ్మెల్యేలకు కూడా దెబ్బలు తగిలాయి. దెబ్బలంటే చిన్న గాయాలు కావు. సిపిఎం రాష్ట్ర నేత రాఘవులు గారికి చెయ్యి విరిగింది. కాంగ్రెస్ నేత ఉపేంద్రకు రక్తగాయం. కాంగ్రెస్ మహిళా విభాగం అధ్యక్షురాలు గల్లా అరుణ, తిక్కవరపు సుబ్బరామిరెడ్డి వంటి వారు పరుగెత్తుకుని వెళ్లి ఒక గదిలో తల దాచుకున్నారు. సిపిఎం వృద్ధ నేతలు ఓంకార్, కొరటాల సత్యనారాయణలను కూడా వదలి పెట్టలేదు పోలీసులు. వీరి వయస్సు 80 ఏళ్లకు పైనే. అంతటితోనూ కక్ష తీరక కొందరు పోలీసు కానిస్టేబిళ్లు క్వార్టర్ ఆవరణంలో నిలిపి వుంచిన కార్లను కర్రలతో బాది, అద్దాలు పగులగొట్టారు. సిఎల్‌పి నేత రాజశేఖర రెడ్డి వాడే ప్రభుత్వ వాహనం కూడా ఈ దాడిలో దెబ్బ తిన్నది. దాదాపు ఒక గంట సేపు పోలీసులు ఎమ్మెల్యే క్వార్టర్లలో వీరవిహారం చేశారు.

వారు ఇంత దౌర్జన్య పూరితంగా ప్రవర్తిస్తే, స్పీకర్ శ్రీమతి ప్రతిభా భారతి మాత్రం ఒక్కమాట మాట్లాడలేదు. ఒక్క పోలీసు అధికారిని పిల్చి మందలించలేదు. పోలీసులు తన

తొరవ 12వ పేజీలో

# తెల్లదొరల పాలనకు నాంది నెల్లూరుసీమ

ఇటు విజయనగర చక్రవర్తులు; అటు గోల్కొండ, బీజాపూర్ సుల్తానులు పతనమైన తర్వాత దక్షిణ భారతదేశంలో వచ్చిన రాజకీయ మార్పుల ప్రభావం నెల్లూరు జిల్లా మీద కూడా ప్రసరించింది. ఈ సంధి కాలంలో జరిగిన ప్రధాన పరిణామం డచ్చి, ఇంగ్లీషు దేశాలకు చెందిన వ్యాపార సంస్థలు ఆంధ్ర తీరంలో పాదం మోపడం. అరవీటి వంశానికి చెందిన విజయనగర పాలకులు చంద్రగిరిని రాజధానిగా చేసుకుని పాలిస్తుండిన కాలంలో తూర్పు తీరంలో ప్రప్రథమంగా యూరోపియన్ వ్యాపారులు ప్రవేశించారు. వారే దీన్ని కోరమండల్ కోస్ట్ అన్నారు. వీరి ముఖ్యమైన వ్యాపారం - ఆంధ్ర చేనేతకారులు నేసిన చేనేత వస్త్రాలు కొని, ఎగుమతి చేయడం. అప్పట్లో ఆంధ్రదేశంలో కలికొల్లు, చీటీలు, లాంగ్ క్లాత్, లుంగీలు, మూరీలు, మస్లిన్లు, పాలెం పోరులు, సాలెం పోరులు, తివాచీలు, ఇజరీలు, రుమాళ్లు తదితర రకాల వస్త్రాలు ఇక్కడ తయారయ్యేవి. డచ్చి, ఇంగ్లీషు కంపెనీలు వాటిని [illegible] ధరలకు కొని తమ దేశాలలో [illegible] ధరలకు అమ్మి విపరీతంగా లా[illegible] గడించేవి. ఆంధ్ర చేనేత వస్త్రాల అందానికి, నాణ్యతకు ప్రప[illegible]చమంతా పేరు లభించింది.

నెల్లూరు జిల్లా నుంచి ఇజరీలు అనబడే ఒక రకం ముతక గుడ్డను ఎగుమతి చేసేవారు. 1828లో ప్రచురితమైన డిస్క్రిప్టివ్ అండ్ హిస్టారికల్ స్కెచస్ ఆఫ్ సిటీస్ అండ్ ప్లేసెస్ ఇన్‌ది డక్కన్ అనే గ్రంథంలో కావలి వెంకట రామస్వామి నెల్లూరులో తయారయ్యే ఇజరీల గురించి ప్రత్యేకంగా ప్రస్తావించారు. అనాటి వ్యాపారానికి నెల్లూరు నగరంలోని ఇప్పటి నవాబుపేట కేంద్ర స్థానం.

యూరోపియన్ వ్యాపారుల ప్రథమ స్థావరం మచిలీపట్నం. అయితే మచిలీపట్నంలో గోల్కొండ రాజ ప్రతినిధుల అరాచకాలు అధికం కావడం, తరచు తమను వేధిస్తుండడంతో డచ్

**నెల్లూరు జిల్లా పుట్టుపూర్వోత్తరాలు - 13**



డాక్టర్ సి.వి. రామచంద్రరావు

వ్యాపారులు విజయనగర పాలకుడు రెండవ వెంకటపతి దేవరాయల అనుమతితో, నెల్లూరుజిల్లా లోని పులికాట్ సరస్సు సమీపాన 1610లో తమ స్థావరం స్థాపించుకున్నారు. ఫ్యాక్టరీ అనబడే వ్యాపార గిడ్డంగి కట్టారు. మలక్కా, దీవులకు, దాని సమీప ప్రాంతాలకు పులికాట్ వామ హస్తం వంటిదని; పులికాట్ నుంచి జరిగే వస్త్ర వ్యాపారం దెబ్బతింటే మలక్కా దీవులలోనూ వ్యాపారం అంతరించి పోతుందని అనాటి డచ్ అధికారులు తమ అధికార పత్రాలలో పేర్కొన్నారు. పులికాట్ కేంద్రం నుంచే వారు నిజాంపట్నం, పెద్దపల్లి, ద్రాక్షారామం, కాకినాడ, భీమునిపట్నం, నాగపట్నం, పోర్తినూవూ, గూటిలంక తదితర సుందర ప్రాంతాలలో వ్యాపారం నిర్వహించే వారు డచ్చి వారు. 1617 నాటికి పులికాట్ సరస్సులోని వ్యాపార గిడ్డంగి దక్షిణ భారతదేశంలోనే పేరుపడింది.

చంద్రగిరి పాలకులు కాని, గోల్కొండ సుల్తానులు కాని, వారి సామంతులు కాని డచ్ వారి వ్యాపారానికి ఏటువంటి భంగం కల్గించలేదు. దీనితో వీరు వస్త్ర వ్యాపారంతో పాటుగా దక్షిణ భారతదేశం నుంచి రాగి, పాదరసం, రంగులు, అత్తరు వంటి ఇతర వస్తువులను హాలండ్, పెరు, సుమత్ర, మలక్కా దేశాలకు ఎగుమతి చేసేవారు. స్థానికంగా ప్రసిద్ధి చెందిన మల్లయ్యచెట్టి అనే వ్యాపారి, అతడి సోదరుడు కొమారి చెట్టి డచ్ వారికి వ్యాపారంలో సహకరించేవారు. మొత్తం తూర్పు తీరానికంతటికి తమ మనుషులను పంపి డచ్‌వారికి వస్త్రాలు, ఇతర ఉత్పత్తులు కొనిపెట్టేవారు.

1689లో ఢిల్లీ మొఘల్ చక్రవర్తులు డచ్ వారికి వ్యాపారం చేసుకోవడానికి అనుమతిస్తూ ఫర్మానా జారీ చేశారు.

1611లో ఈస్ట్ ఇండియా కంపెనీ రంగ ప్రవేశం చేసింది. వీరి ప్రధాన స్థావరం కూడా మొదట మచిలీపట్నమే.

కొరవ 7వ పేజీలో

# రాష్ట్ర సమస్యలపై నినదించిన నేదురుమల్లి

మాజీ ముఖ్యమంత్రి, నరసారావుపేట పార్లమెంట్ సభ్యుడు నేదురుమల్లి జనార్దనరెడ్డి ఈ వారంలో లోక్‌సభలో దాదాపు రెండు డజన్ల ప్రశ్నలు వేశారు; పలు మార్లు చర్చలల్లో పాలు పంచుకున్నారు. పార్లమెంటుకు హాజరు కావ డాన్ని జనార్దనరెడ్డి గారు ఇటీవలి కాలంలో చాలా ముఖ్యమైనదిగా పరిగణిస్తున్నారు. ఒక్కరోజు కూడా తప్పి పోకుండా హాజరౌతున్నారు. రాష్ట్రంలో కాంగ్రెస్ ఎమ్మెల్యేల నిరసన దీక్షలు జరుగుతున్నా, అందులో తన సతీమణి కూడా వున్నా ఆయన మాత్రం శని, ఆది వారాలలో తప్ప హైదరాబాద్‌కు రాలేదు. ఈ వారంలో జనార్దనరెడ్డి గారు లోక్‌సభలో ప్రస్తావించిన విషయాలు ఇవి-

ఢిల్లీ కార్యాలయాలలో మగ్గుతున్న రాష్ట్రానికి సంబంధించిన ఇర్రిగేషన్ పథకాల సమాచారం కోరాడు జనార్దనరెడ్డి. దానికి కేంద్ర నీళ్లమంత్రి బిజోయ్ చక్రవర్తి సమాధానం ఇస్తూ - రాష్ట్ర ప్రభుత్వం నుంచి 19 నీటి పారుదల పథకాలకు ప్రతిపాదనలు వస్తే 14 పథకాలకు గ్రీన్ సిగ్నల్ ఇచ్చామని; తక్కిన పథకాల విషయంలో టెక్నికల్ అడ్వయిజరీ కమిటీ చేసిన సూచనలు, కోరిన వివరణలపై రాష్ట్ర ప్రభుత్వం సమాధానం పంపవల్సి వుందని మంత్రి తెలియచేశారు. రాష్ట్ర ప్రభుత్వం నిధుల కొరతను ఎదుర్కొంటున్నా ప్రాజెక్టులను పూర్తి చేయడానికి 1996 నుంచి యాక్సిలరేటెడ్ ఇరిగేషన్ బెనిఫిట్స్ ప్రోగ్రాం క్రింద కేంద్ర ప్రభుత్వం అప్పు ఇస్తున్నదని కూడా చెప్పాడు మంత్రి.

రాష్ట్రంలో విద్యుత్ కొరతపై జనార్దనరెడ్డి అడిగిన ప్రశ్నకు విద్యుత్ మంత్రి శ్రీమతి జయవంతి మెహతా సుదీర్ఘ సమాధానం చెప్పారు. రానున్న ఐదేళ్లలోఒక లక్షా ఇరవై నాలుగు వేల ఐదు వందల ఇరవై ఆరు కోట్ల

**వారం రోజుల్లో లోక్‌సభలో 24 ప్రశ్నలు**

రూపాయల పెట్టుబడితో దేశంలో విద్యుత్ ఉత్పత్తి పెంచడానికి కొత్త ప్రాజెక్టులు చేపట్టామని చెప్పారు మంత్రి. విద్యుత్ కొరతకు సంబంధించి ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో 11వేలా 95 మిలియన్ యూనిట్ల విద్యుత్ అవసరమైతే 10వేలా 25 మిలియన్ యూనిట్ల ఉత్పత్తి మాత్రమే జరుగుతున్నదని, డిమాండ్‌కు సప్లైకి మధ్య వ్యత్యాసం 9.1శాతమని తెలియజేసింది ప్రభుత్వం. ఒరిస్సా, పశ్చిమబెంగాల్, మేఘాలయ, అస్సాం వంటి రాష్ట్రాలలో వారి అవసరాలకంటె అధికంగా విద్యుత్ లభిస్తున్నది; ఉత్తరప్రదేశ్, బీహార్, మహారాష్ట్ర, తమిళనాడు, మధ్యప్రదేశ్, గుజరాత్ తదితర కీలక రాష్ట్రాలన్నింటిలో విద్యుత్ కొరత వుంది.

ప్రజలలో నిరక్షరాస్యత నిర్మూలించడానికి మధ్యప్రదేశ్ ప్రభుత్వం ప్రత్యేక పథకం అమలు చేస్తున్నదని, కాని అందుకు వారు కేంద్రాన్ని డబ్బు ఇవ్వమని మాత్రం అడగడం లేదని చెప్పాడు హ్యూమన్ రిసోర్సెస్ మంత్రి మురళీ మనోహర్‌జోషి. చంద్రబాబు అయితే ఇటువంటి పథకాలు చేపట్టాలన్న కల వస్తే చాలు, కేంద్రం వాకిట్లో చిప్పపట్టుకుని నిలబడతాడు. హైదరాబాద్ నగరం చుట్టూ ఒక ఎక్స్‌ప్రెస్ బైపాస్ రోడ్డు నిర్మించడానికి కేంద్ర సహాయం కోరారని జనార్దనరెడ్డి అడిగిన ప్రశ్నకు సర్ఫేస్ ట్రాన్స్‌పోర్ట్ మంత్రి హుకుందేవ్ నారాయణ్ యాదవ్ సమాధానం చెప్తూ - ఆంధ్ర ప్రభుత్వం తమను సహాయం అడిగిన మాట నిజమే కాని, తాము వారికి ప్రైవేట్ సంస్థల ద్వారా ఈ రోడ్ నిర్మాణం చేయించుకోమని సలహా ఇచ్చామని, కేంద్రం దగ్గర ఈ రోడ్డు కోసం

కొరవ 7వ పేజీలో



పెంచిన విద్యుత్ ఛార్జీలకు వ్యతిరేకంగా కాంగ్రెస్ డిసిసి ఆధ్వర్యంలో జరిగిన నిరాహార దీక్షా శిబిరంలో మాట్లాడుతున్న ఆ సెల్ రాష్ట్ర కార్యదర్శి ఉడతా వెంకట్రావు.

# సణుగుడు

### * పత్రికా కార్యాలయాలపై దాడి గర్హనీయం!

హైదరాబాద్ పోలీసు కాల్పులకు నిరసనగా జరిగిన బంద్‌లో నెల్లూరు ఈనాడు దిన పత్రిక కార్యాలయంపై ప్రదర్శన కారులు దాడి చేయడం విచారకరం; గర్హనీయం కూడా. విద్యుత్ ఆందోళనపై ఈనాడు అనుసరిస్తున్న సంపాదకీయ విధానం ప్రతిపక్షాలకు నచ్చడం లేదు. ధరలు తగ్గించమని తాము మూడు నెలల నుంచి ఆందోళనలు చేస్తుంటే, దానికి తగిన ప్రచారం ఇవ్వకపోగా, వీలు దొరికినప్పుడల్లా తమ ఆందోళనను కించపరిచే వార్తలు వ్రాయడం, ధరల పెంపకాన్ని సమర్థించడం చేస్తున్నదని ఈనాడుపై వీరికి కోపం. హైదరాబాద్ పోలీసు కాల్పులపై సైతం అదే వైఖరితో సంపాదకీయం వ్రాయడంతో వీరికి పుండు మీద కారం చల్లినట్లయ్యింది. పోలీసులు దుర్మార్గంగా తమ నేత బివి రాఘవులను కొట్టి, చెయ్యి విరిచి వేస్తే పత్రికలో కనీసం ఆ వార్త కూడా ప్రచురించక పోవడం సిపిఎం కార్యకర్తల ఆగ్రహానికి కారణమైంది. వీటన్నింటి పర్యవసానం - పత్రికా కార్యాలయంపై దాడి. ఆత్మకూరులో పత్రికా పత్రులు అంగళ్లనుంచి పెరుక్కొని తగల బెట్టారట.

అయితే పత్రికలలో తాము మెచ్చేవి, తమకు నచ్చేవి మాత్రమే వార్తలుగా రావాలన్న దురహంకారం రాజకీయ పార్టీ కార్యకర్తలలో ఏర్పడడం ప్రమాదకరం. సమకాలీన సమాజంలో జరుగుతున్న సంఘటనలపై వాస్తవాలు ప్రచురించవల్సిన సామాజిక బాధ్యత పత్రికలపై వున్నప్పటికి, ఒక వివాదాస్పద అంశంపై తన స్వంత అభిప్రాయానికి అనుగుణంగా సంపాదకీయ విధానం నిర్ణయించుకొనే హక్కు పత్రికలకు వుంటుంది. పత్రికా స్వేచ్ఛ అంటే అదే. దాన్ని పరిహరించే ఎటువంటి ప్రయత్నం కూడా ప్రతి ప్రజాస్వామ్య వాది ఖండించి తీరాలి. పత్రికా కార్యాలయాలపై దాడి అంటే, పత్రికా స్వాతంత్ర్యంపై దాడి చేయడం క్రిందే లెక్క. భయపెట్టి, బెదరించి, ఒత్తిడి చేసి సంపాదకులను అదుపు చేయగల్గమనుకోవడం మూర్ఖత్వం. ప్రపంచ చరిత్రలో ఎక్కడా అటువంటి ప్రయత్నాలు ఫలించలేదు.

తెలుగు పత్రికా లోకంలో ఈనాడుకు ఒక విశిష్ట స్థానం వుంది. పక్కవాడి చేతిలోని పత్రికను తొంగి చూడడంతోనే తృప్తిపడే తెలుగు వారి చేత పత్రిక కొనిపించి చదివే అలవాటు చేసిన గొప్పతనం దానిది. దాని యాజమాన్యం రాష్ట్ర రాజకీయాలకు సంబంధించి తరచుగా ఏకపక్షంగా వ్యవహరించడం మామూలు. అది తమకు అనుకూలంగా వున్నంత కాలం, ఆ పక్షం రాజకీయవాదులకు దురద పుడితే గోక్కున్నంత కమ్మగా వుంటుంది; తాము అవతలి పక్షానికి మారిపోయినప్పుడు మాత్రం ఒంటికి దురదగుంటాకు పూసుకున్నట్లు విలవిల లాడి పోతున్నారు. సిపిఎం నాయకులు తెలుగుదేశంతో ఆవు ప్రక్కన దూడల వలె తిరిగినంత కాలం ఈనాడు వారికి అభిమాన పత్రిక అన్నది లోకమెరిగిన సత్యం; ఇప్పుడు ఆ రాజకీయ సంసారం బ్రద్దలై విడాకులు పుచ్చుకున్నారు కాబట్టి, అదే ఈనాడు వార్తలు వారిని చిర చిర లాడిస్తున్నాయి.

ప్రజాస్వామ్యంలో పత్రిక అనేది ఒక బలీయ శక్తి; దానికి ప్రజలను ప్రభావం చేసే శక్తితో పాటు, తనపై

**డోలేంద్ర**

జరిగే దాడులను కాచుకునే సామర్థ్యం స్వయం సిద్ధంగా వుంటుంది. ఇటువంటి చిన్న చిన్న ఎదురు దెబ్బలు పత్రికలకు చీమ కుట్టినంత కష్టం కూడా కల్గించలేవు. కాని ఇటువంటి దుందుడుకు చర్యల ద్వారా వాటికి పాల్పడిన వ్యక్తులు, సంస్థలు పలచనై పోతాయి. చరిత్రలో పలు మార్లు రుజువైన నిజం ఇది.

ఒక్క సిపిఎం పార్టీయే కాదు, ప్రతి రాజకీయ వాది ఈ విషయం గుర్తుంచుకోవడం అవసరం. తమ విధానాలు, కార్యక్రమాలు, ప్రజా సమస్యలపై సరైన రీతిలో స్పందన వంటి వాటి ద్వారా పత్రికలను ప్రభావితం చేయడం ప్రజాస్వామ్య సమ్మతమౌతుందే తప్ప; దాడులు, దౌర్జన్యాల రూపంలో ఏమీ సాధించలేవు. జిల్లా సిపిఎం నేతలు, తమ కార్యకర్తలు చేసిన ఈ

కొరవ 7వ పేజీలో

# రక్తం రుచి మరిగిన పోలీసులు

ఛలో అసెంబ్లీ కార్యక్రమానికి తరలి వచ్చిన ప్రదర్శనకారులపై హైదరాబాద్ పోలీసులు జరిపిన అమానుష దౌర్జన్యకాండ రాష్ట్ర చరిత్రలోనే కని, విని ఎరుగనిది. పోలీసులు అంత క్రూరంగా, రక్తం త్రాగే రాక్షసుల వలె ప్రవర్తించ గలరని కథలలో చదవడం, సిని మాలలో చూడడం తప్ప, ప్రత్య క్షంగా అనుభవానికి రావడం ఇదే ప్రథమం.

నిరాయుధులైన ప్రదర్శన కారులపై పోలీసులు పశువుల వలె విరుచుకపడ్డారు; పిట్టలను కాల్చి నట్లు కాల్చారు; మహిళలనే స్పృహ కూడా లేకుండా బూటు కాళ్లతో తన్నారు; ఇనుప రాడ్లు లోపల అమర్చిన పొడుగాటి కర్రలతో తలలు పగులగొట్టారు; ఆడవాళ్ల రవికలు చింపి పారేశారు; జుట్టు పట్టుకొని రోడ్లపైన ఈడ్చుకొంటూ పోయారు. రోడ్డుకు అడ్డంగా వేసిన ఇనుప ముళ్లకంచెలో చిక్కుకుని, రక్తపు మడుగులో పడిపోయి, బాధ తో హాహాకారాలు చేస్తుండిన వారి ని నిర్దయగా చావగొట్టారు.

వీరి ఆగ్రహానికి కారణం - ప్రదర్శన కారులు తమపై రాళ్లు విసరడం. అది తప్పే; కాదన లేము. అంత మాత్రాన తమ ఇష్టం వచ్చినట్లు జనాన్ని చంపాలా? చిత్రవధ చేయాలా? నెత్తురు తాగాలా? ఒక పోలీసు అధికారి తన రివాల్వర్‌లో బుల్లెట్లు ఖాళీ అయ్యేవరకు జనానికి గురిపెట్టి కాల్చాడు; నలుగురైదుగురు కానిస్టే బిల్లు దాదాపు రెండు గంటల సేపు ఎత్తిన తుపాకి దించకుండా, కాలు స్తూనే వుండినారు. వీరందరి గురి నేరుగా జనంపైకి; అందుకు ఏ మాత్రం సంకోచించలేదు, తడబడ లేదు. తమ తుపాకి గుండు తగిలిన వారు పిట్టల వలె నేలమీదకు వాలి పోతుంటే, ఆ దృశ్యం టివి ఛానళ్ల లో చూస్తుండిన వారికి గుండె చెదిరి పోయింది తప్ప, కాల్పులు జరిపే పోలీసుల మనస్సులలో మాత్రం చలనం లేదు. కనీస పాటి మానవత్వం లేని పశువుల వలె, కసాయి వారి వలె, నరమాంస భక్షకుల వలె ప్రవర్తించారు వారు.

ప్రదర్శనలు, ప్రజా సమూ హాలు అదుపు తప్పినప్పుడు వ్యవహ రించ వల్సిన తీరుపై స్పష్టమైన నిబంధనలు వున్నాయి. కేవలం నడుము క్రింది భాగంలోనే కాల్చా లని, వరసగా రెండు రౌండ్లకు మించి తుపాకి పేల్చడానికి లేదని. మేజిస్ట్రేట్ ఉత్తర్వు లేకుండా కాల్పులు జరపడానికి లేదని చట్టం పేర్కొంటున్నది. బ్రిటిష్ కాలంనాటి కిరాతక పోలీసులు కూడా ఈ నిబంధనలు తుచ తప్పకుండా పాటించేవారు. కాని హైదరాబాద్ పోలీసులకు మాత్రం అవేవి గుర్తుకు రాలేదు; చేజారితే తిరిగి అవకాశం రాదన్నట్లు, జనంపైకి కక్షకట్టి నర మారణ హోమం సృష్టించారు. కాల్చండి చూద్దాం.. అంటూ పోలీసు లకు ఎదురుపోయిన ఒక యువకు డ్ని నేరుగా గుండెకు గురిపెట్టి, అతి దగ్గరగా గుండు పేల్చారు.

మనుషులు చేసే పనేనా ఇది? కనీస పాటి మానవత్వం కల్గిన వారు చేయగల్గిన హత్యాకాండేనా ఇది? పోలీసులలో ఇంత క్రూరత్వం, కిరాతకత్వం ఎందుకు ప్రబలింది? కాకి దుస్తులు వేసుకుని ఎవరినైనా చంపగలమన్న ధోరణి ఎవరు ప్రేరేపించారు?

ఎక్కడో మారు మూల గ్రామా లలో, అడవులలో తమను హెచ్చ రించేవారు లేరనే భరోసాతో, చట్టా న్ని ధిక్కరించి ప్రవర్తిస్తే, అర్థం చేసుకోవచ్చు. టివి ఛానళ్ల ద్వారా కొన్ని లక్షల మంది ప్రజలు తమను, తమ చేష్టలను చూస్తున్నారని తెలిసే నిర్దాక్షిణ్యంగా ప్రవర్తించగల్గారంటే పోలీసులు ఎంతగా బరితెగించి పోయింది అర్థమౌతున్నది. వీరు అడ వులలో జరిపే ఎన్‌కౌంటర్ హత్యలు ఇంకెంత క్రూరంగా, ఘోరంగా వుంటాయో తెలిసి వస్తున్నది.

పోలీసుకు జనంపై ఎందుకు కక్ష? అది కక్ష కాదు, కర్తవ్య నిర్వ హణ అని సమర్థించ చూస్తున్నది ప్రభుత్వం. ప్రభుత్వం ఇచ్చే అలుసు వల్లనే పోలీసులు ఇంత బరితెగించి వ్యవహరించారనడం నిజం. రాష్ట్ర ముఖ్యమంత్రి పోలీసుల చేత చేయించిన దుర్మార్గం ఇది. అందు వల్లనే ఆయన మానవత్వం లేని దానవుల వలె ప్రవర్తించిన పోలీసు లపై చర్య తీసుకోవడానికి వెనుకాడు తున్నారు. కాని ఇది భస్మాసుర

**జమీన్‌రైతు**

వరం వంటిదన్న నిజం ఆయనకు ముందు ముందు కాని తెలిసి రాదు.

ఈ మొత్తం సంఘటనలపై న్యాయ విచారణ జరిపించడం చాలా అవసరం. ఇప్పుడు తన రాజకీయ అవసరాలకు ఉపయోగ పడింది కాబట్టి ఈ మారణ కాండ ను సమర్థిస్తున్నారు ముఖ్యమంత్రి. జనాన్ని చంపడానికి తమకు లైసె న్స్ వుంది అన్న తప్పుడు అభి ప్రాయం పోలీసులలో బలపడగానికి దోహదపడుతున్నది ప్రభుత్వ వైఖరి. నిబంధనలకు వ్యతిరేకంగా, చట్టాన్ని ధిక్కరించి ప్రజలపై అత్యాచారం చేసిన పోలీసు ఉన్నతాధికారులను గుర్తించి, శిక్షించడం అవసరం. ఈ విషయంలో పలు కోర్టు తీర్పు లు కూడా ప్రభుత్వ కర్తవ్యాన్ని నిర్వచించి వున్నాయి. పోలీసు కాల్పులలో ప్రజలు చనిపోవడం జరిగితే, సంబంధిత అధికారులపై హత్యా నేరం మోపుతూ ఎఫ్ఐఆర్ దాఖలు చేయాలని, విచారణలో అధికారుల తప్పు లేదని తేలితే దాన్ని ఉపసంహరించాలని ఆంధ్ర ప్రదేశ్ హైకోర్టు తీర్పు చెప్పి వుంది. మానవ హక్కుల సంఘం పోలీసు కాల్పుల విషయంలో తీసుకోవా ల్సిన చర్యలు నిర్దేశించి వుంది. పోలీసు స్టేషన్లలో అత్యాచారం వల్ల ఇద్దరి చావుకు కారకులైన అధికారులకు గుంటూరు కోర్టు శిక్ష విధించింది. న్యాయ వ్యవస్థ పట్ల ఏ మాత్రం గౌరవం వుండినా హైదరాబాద్ పోలీసులు ఇంత క్రూరంగా వ్యవహరించి వుండరు; ప్రభుత్వం దాన్ని సహించి వుండదు.

ఈ సంఘటనలపై చర్యకు, కనీసం విచారణకు తిరస్కరించ డం ద్వారా పోలీసు దుర్మా ర్గాలను సమర్థిస్తున్న చంద్రబాబు నాయుడు గారిని ప్రజలు శిక్షించే రోజు ఎంతో దూరంలో లేదు.*

**జమీన్‌రైతు**

1.9.50

వెల: 0-3-0 పేజీలు: 12

### నెల్లూరు జిల్లాలో భన్సాలీ పర్యటన

ఆచార్య భన్సాలీ గారు గత 21, 22తేదులలో నెల్లూరు జిల్లాలో చేసిన పర్యటనాన్ని సింహావలోకనం చేస్తె, ఒకక్క మాటలో వారి అభిప్రాయాన్ని, వారి జీవిత రహస్యాన్ని ఇప్పటి ప్రభుత్వాల ఎడ వారి దృక్పథాన్ని మనం గమనించవచ్చు. "కడుపు నిండా అన్నం, వంటి నిండా గుడ్డ, తలదాచు కోవడానికి పంచ దేశీయులకు కల్గించ డమే స్వరాజ్య ముఖ్యలక్షణం. అదే గాంధీ మహాత్ముని యొక్క జీవితవాంఛ. దీన్ని సరఫరా చేయలేని ప్రభుత్వం, ప్రభుత్వం కాదు. ఈ అవసరాలను ఇప్పటి ప్రభుత్వాలు తీర్చలేక పోవుట వల్లనే కమ్యూనిస్టులని, సోషలిస్టులని ప్రజలను రెచ్చగొడుతున్నారు. కనీస జీవితావసరాలను ప్రతి మానవునికి కలిగించలేని ప్రభుత్వము ఎట్టిదైనా దాని, దాని అధినాయకులు ఎంతటి గొప్పవారైనా గాని తమ స్థానముల నుంచి తప్పు కోవడమే మేలు". నెల్లూరు సభలోనూ, కమ్యూనిస్టు హత్యా కాండ జరిగిన నెరేడుపల్లి సభలోనూ, సర్వుంబు పడగసీడను 'కృప వసించిన విధాన' నివసిస్తూ వుండే సందుకారు ప్రజలలోను భన్సాలీ గారు ఉపన్య సించినప్పుడు చెప్పిన ముక్కలివే. కమ్యూనిస్టు సిద్ధాంతములలో దౌర్జ న్యాన్ని, హత్యాకాండను విడదీస్తె ఆక్షేపించ దగిన విషయములు అంతగా లేవని భన్సాలీ గారి అభిప్రాయం. దౌర్జన్యం చేత కొన్ని పనులు కొంత కాలం సాగించ వచ్చు. కాని హిరణ్యాక్షుని వలనే, రావణాసురుని వలనే, ఆరిపోనున్న దీపాల వలె, అంతరించగలరు. నిర్బంధం చేత ప్రజలను ఒక సిద్ధాంతంలోకి తీసుకపోజాలము. అవి మానవ




స్వాతంత్ర్యానికి గొడ్డలిపెట్టు" భన్సాలీ గారు చెప్పిన రెండవ విషయమిది.

### నెల్లూరు ముచ్చట్లు సంతోష వార్త

స్వర్గీయ రేబాల పట్టాభిరామిరెడ్డి గారి ధర్మపత్ని సుజాతమ్మ గారు పురమందిరం ప్రోగ్రెసివ్ యూనియన్ వారికి తన భర్త వాగ్దానము చేసి వుండిన ప్రత్యేకముగా గ్రంథపఠనాల యమున గూడా భర్తగారి వాగ్దానమును నెరవేర్చపూనుట కూడా ముదావహం. ఈ పుణ్యకార్యములు పట్టాభిరామిరెడ్డి

తరువాయి 10వ పేజీలో

## జనవాణి

# బషీర్‌బాగ్ కాదది జలియన్ వాలాబాగ్

విద్యుత్ ఛార్జీల పెంపకాన్ని నిరసిస్తూ రాష్ట్ర రాజధానిలో నిరసన ప్రదర్శన చేయడానికి వెళ్లిన ప్రజలపై బషీర్‌బాగ్ వద్ద ప్రభుత్వం పాశవికంగా కాల్పులు జరపడం అన్యాయం, అక్రమం. ఈ సంఘటన స్వాతంత్ర్యోద్యమంలో జనరల్ డయ్యర్ చేయించిన జలియన్ వాలాబాగ్ సంఘటనను తలపింప జేసింది. పెంచిన ఛార్జీలు కట్టలేం, మహాప్రభో! అని విన్నవించడానికి వచ్చిన ప్రజలపై ఇంతటి మారణ కాండను ప్రభుత్వమే చేయించడంకన్నా, సభ్య సమాజంలో సిగ్గుమాలిన చర్య ఇంకొకటి లేదు.

నెల్లూరు — డాక్టర్ వి.యశోధర

### పోలీసుల దుర్మార్గం

కరెంట్ ఛార్జీల పెంపుదలకు వ్యతిరేకంగా కాంగ్రెస్, కమ్యూనిస్టు పార్టీలు 90రోజులుగా రాష్ట్ర వ్యాప్తంగా వివిధ నిరసనలను ప్రజాస్వామ్యబద్ధంగా చేస్తున్నాయి. 28తేది ఈ పార్టీలిచ్చిన పిలుపు మేరకు జరిగిన 'ఛలో అసెంబ్లీ' కార్యక్రమం పోలీసుల దుందుడుకు తనం వల్ల రక్తసిక్తమయ్యింది. నిరసనలో భాగంగా ఒకే ఒక్క బారికేడ్‌ను ధ్వంసం చేసిన కార్యకర్తలను పోలీసుల విచక్షణా రహితంగా లాఠీలతో రక్తం కారేలా కొట్టారు. ఎటువంటి హెచ్చరికలు లేకుండా కాల్పులు జరపడం వల్ల ఐదుగురు అమాయకుల ప్రాణాలు అనంతవాయువుల్లో కలసి పోయాయి. ప్రజాపోరాటాన్ని లాఠీలతో క్రూరంగా అణచివేయాలన్న మనస్తత్వం గల ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు వంటి వ్యక్తి ప్రజాస్వామ్య వ్యవస్థలో ఉండదగరు. ఛార్జీల పట్ల ప్రజల్లో పెరిగిన నిరసనను గుర్తెరిగి ఇకనైనా వాటిని తగ్గించకుంటె, తెలుగుదేశం పార్టీకి గడ్డు కాలం తప్పదు. రాజధానిలో పోలీసుల విశృంఖల విజృంభణపై హైకోర్టులో సిట్టింగ్ జడ్జిచేత విచారణ జరిపించాలి.

నెల్లూరు — జె.పోలిరెడ్డి

### ప్రతిష్ఠకు పోరాదు - విజ్ఞతతో ఆలోచించాలి

ముట్టుకొంటె మాత్రమే షాక్ కొట్టె కరెంట్, విద్యుత్ ఛార్జీలు విపరీతంగా పెంచిన తర్వాత, ముట్టుకోకుండానే షాక్ కొడుతోంది. ఇటీవల వచ్చిన విద్యుత్ బిల్లులను చూస్తె గుండె గుభేలవుతుంది. అస్తు బిస్తు ఆదాయాలతో అంత మాత్రంగా జరుపుకొంటున్న కాపురాల్లో, కరెంట్ ఛార్జీలు ఎక్కువగా పెరగడంతో కష్టాలు తీవ్రమయ్యాయి. తినడానికి కడుపు నిండా బువ్వకావాలా? లేక కంటి నిండా నిద్రపోవడానికి ఫ్యాన్ 'హవా' కావాలో తేల్చుకోవాల్సిన విషమ సంకట పరిస్థితి దాపురించింది. విద్యుత్ శాఖకు భారీ నష్టాలొచ్చాయి. కాబట్టి విధిలేక విద్యుత్ ఛార్జీలు పెంచాయంటుంది ప్రభుత్వం. 'లైన్‌లాసస్' వల్లే ఈ నష్టాలొస్తున్నాయన్నది అసలు నిజం. అంటె సరఫరా అయ్యే నూరు రూపాయల విద్యుత్‌కు నలభై ఒక్క రూపాయలు మాత్రమే బిల్లుల ద్వారా జమ అవుతుంది. మిగతా 59శాతం నష్టానికి ఎవరిది బాధ్యత? బాగా అభివృద్ధి చెందిన దేశాలలో కూడా వృథాపోయే విద్యుత్ 8 నుంచి 10 శాతం వరకుంటుంది. మనది సాంకే తికంగా వెనుకబడిన దేశం కాబట్టి ఈ నష్టం మరో 5శాతం ఎక్కువనుకొన్నా మిగతా 36శాతం నష్టాలకు కారణ మేమిటి? అవినీతి అసమర్థత, నిర్వహణ లో అవకతవకలు, జరిగిన తప్పులు సరిదిద్దుకోవాల్సింది పోయి, నిజాయితీగా బిల్లులు కట్టేవారిపై అదనపు భారం మోపడం అనుచితం. ప్రతిష్ఠ కోసం ప్రాకులాడక, విజ్ఞతతో పునరాలోచించి ప్రస్తుతమున్న బిల్లుల వసూళ్లలోని 4

తరువాయి 10వ పేజీలో

# నెల్లూరు బంద్ బ్రహ్మాండం

22తేది ఛలో అసెంబ్లీ కార్య క్రమంలో పాల్గొన్న కాంగ్రెస్, వామపక్షాల కార్యకర్తలపై పోలీసు కాల్పులు, దాడికి నిరసనగా 23తేది జరిగిన బంద్ నెల్లూరుటౌన్‌లో విజయవంతమయ్యింది. ప్రజలు స్వచ్ఛందంగా బంద్‌లో పాల్గొన డంతో టౌనంతా నిర్మానుష్యమై పోయింది. పెద్దగా ప్రచారం లేకపోయినా టివిలు, వార్తాపత్రికల ద్వారా విషయం తెలుసుకున్న వ్యాపార సంస్థలు, హోటళ్లు, సినిమా థియేటర్ల యజ మానులు వీటిని మూసేశారు. ఆర్టీసి డిపోల నుంచి సాయంత్రం 4 గంటల

## నెల్లూరుసంగతులు

వరకు ఒక్క బస్సు బయటకు రాలేదు. నైట్‌హాల్ట్ నుంచి తిరిగివస్తున్న నెల్లూరు వన్ డిపోకు చెందిన ఆర్టీసి బస్సును వెంకటేశ్వర పురం వద్ద కాంగ్రెస్ కార్యకర్తలు ఆపి అద్దాలు పగులగొట్టారు. టౌన్‌లోని వివిధ సెంటర్లలో ఉదయం 9 గంటల నుంచి మధ్యాహ్నం 2 గంటల వరకు సిపిఎం కార్యకర్తలు కాపు గాయడంతో రిక్షాలు కూడా చాటు మాటుగా తిరగలేక పోయాయి.

ఉద్యమకారులు తమ కసనంతా చంద్రబాబు నాయుడుపై చూపారు. వలుచోట్ల ఆయన దిష్టి బొమ్మలను తగులబెట్టారు. ప్రభుత్వ కార్యాలయాలు మూయించను వెళ్లిన కార్యకర్తలు డిఆర్వో ఛాంబర్‌లోని చంద్రబాబు క్యాలెండర్‌ను చింపి చెత్తబుట్టలో వేశారు. కలెక్టరేట్ ప్రాంగణంలో వున్న డిపిఆర్వో కార్యా లయంలో వున్న చంద్రబాబు నాయుడు ఫోటోలన్నింటినీ కసితీరా చించి కాళ్లతో తొక్కారు. హౌరా, పినాకిని ఎక్స్‌ప్రెస్‌లను ఉద్యమకారులు విజయ మహల్ గేటు వద్ద ఆపేశారు. ఉద్యమ కారులు వెళ్లి అభ్యర్థన చేయడంతో న్యాయమూర్తులు కూడా కేసులు విచా రిస్తున్న తమ పీఠాలు వదలి వచ్చేశారు. పిసిసి మాజీ సభ్యుడు కోటంరెడ్డి శ్రీధర్‌రెడ్డి కలెక్టరేట్‌పై నల్లజండా ఎగురవేశారు. కనకమహల్ సెంటర్‌లో లక్షలు విలువ చేసే చంద్ర బాబు నాయుడు జన్మభూమి కటౌట్‌ను బంద్ నిర్వాహకులు క్రిందకు దించి కాల్చేశారు. బైపాస్ రోడ్డు మిలీనియం పార్కులోని జన్మభూమి స్థూపాన్ని ధ్వంసం చేశారు. ఇక్కడే వున్న మిలీ నియం సబ్‌స్టేషన్ అద్దాలు పగుల గొట్టడంతో పాటు, ఇక్కడి కరెంట్ బిల్లులు వసూలుకు సంబంధించిన రసీదు పుస్తకాలను చింపి బయట పారేశారు. కొందరు సిపిఎం కార్యకర్తలు ఆర్.ఆర్. వీధిలోని ఈనాడు కార్యాలయంలో ప్రవేశించి అక్కడి ఫర్నీచర్, ఫోనుతో

కొరవ 11వ పేజీలో



విద్యుత్ చార్జీల పెంపుదలకు వ్యతిరేకంగా నిరాహారదీక్ష చేస్తున్న సిఎల్పీ నేత వైఎస్ రాజశేఖర్ రెడ్డి, నెల్లూరు, రాపూరు ఎమ్మెల్యేలు వివేకానందరెడ్డి, రామనారాయణరెడ్డిలను పరామర్శిస్తున్న నెల్లూరు మునిసిపల్ కౌన్సిలర్లు.

# పెరిగిన ధరలతో దిగిన కిక్కు!

నెల్లూరులో మద్యం ధరలను అమాంతం పెంచేశారు. విపరీతంగా పెంచిన ధరల మూలంగా నెల రోజు ల్లోనే బ్రాందీ షాపుల యజమానులు లక్షలు గడించేశారు. సందట్లో సడేమి యాగా ఎక్సైజ్ అధికారులు కూడా బాగా లాభపడ్డారు. టౌన్‌లోని పెద్ద బ్రాందీ షాపుల వాళ్లు జూలై 23తేదీ ప్రత్యేకంగా సమావేశమై మళ్లీ కొత్త సిండికేట్‌గా తయారయ్యారు. ఆగస్టు 1తేదీ నుంచి మద్యం రేట్లను బాగా పెంచి దోచుకో వాలని తీర్మానించారు. దీంతో 20-25 రూపాయల మధ్య అమ్ముతుండిన చీప్ లిక్కర్ క్వార్టర్ బాటిల్ 30 - 35 రూపా యలయ్యింది. 40 - 45 రూపాయల మధ్య అమ్ముతుండిన బీర్ బాటిల్ 50 - 60 రూపాయలమధ్య ధర పలుకు తుంది. బ్రాందీ విస్కీ క్వార్టర్ బాటిళ్లు 50 రూపాయల నుంచి 65 రూపాయలై పోయాయి.

ఈ ఎక్సైజ్ సంవత్సరంలో ఎక్కడా మద్యం సిండికేట్లు ఏర్పడకుండా గట్టి చర్యలు తీసుకొంటామని ఈ శాఖా మంత్రి తుమ్మల నాగేశ్వరరావు గట్టిగా చెప్పారు. ఒకవేళ ఎక్కడైనా సిండికేట్లు ఏర్పడితే గవర్నమెంట్ షాపులు తెరచి అమ్ముతుందని మంత్రి చెప్పిన మాట ఏ స్థితిలో వుండి చెప్పారో అర్థం కావడం లేదు. అదేవిధంగా ప్రతి బాటిల్‌పై విధిగా రేటు ముద్రించి అమ్ముతామన్న వాగ్దానం కూడా ఎంత పెద్ద మొత్తం లంచంతో మరుగున పడేలా చేశారో అర్థం కావడం

## మద్యం సిండికేట్ దోపిడి - ఎక్సైజ్ దొరలకు రాబడి

లేదు. నెల్లూరులో గతంలో పనిచేసి అవినీతిపరునిగా పేరు గాంచిన ఎక్సైజ్ ఎస్పీ గంగాధరంను, కొత్త ఎస్పీ అధిగ మించి బ్రాందీ షాపుల వారితో మామూళ్ల విషయమై కొత్త రేట్లు కుదుర్చుకోవడంతో బ్రాందీ రేట్ల పెంపకంలో షాపుల యజమానులు రెచ్చి పోయారన్న విమర్శ కూడా వినవస్తుంది. నెల్లూరు జిల్లాలో ఎక్సైజ్ శాఖ అవినీతి ఊబిలో పూర్తిగా కూరుకపోయి వుండడం వల్ల 24 గంటల పాటు బ్రాందీ షాపులు తెరచి వుంచడం తోపాటు, వాటికి అనుబంధంగా బార్లు, బెల్ట్ షాపులు కూడా పుట్టుకొచ్చేస్తు న్నాయి. మద్యం ధరల తగ్గుదలకు మందు బాబు మద్యం త్రాగకుండా వుండడమే సరైన పరిష్కార మనవచ్చు.

## అందుబాటులో మినీ ఛేర్మన్ ఆఫీసులు

నెల్లూరు మునిసిపాలిటీలో వార్డు కమిటీ ఛేర్మన్ల కార్యాలయాలను ఏర్పాటు చేయడంలో ఏర్పడిన గొడవ విషయమై సిపిఎం కౌన్సిలర్లు ఒక వివరణ పంపారు. వార్డు కమిటీల ఆఫీసుల కేటాయింపుకు ఖచ్చితమైన నిబంధనలు పాటించి వివాదాలకు తావులేకుండా వ్యవహరించా లన్నారు. వివాదం ఏర్పడిన 8వార్డు కమిటీ ఆఫీసును వార్డు కమిటీ సమావేశం జరిపి, కౌన్సిల్ ఆమోదంతో అందరికి అందుబాటులో వుండే విధంగా ఏర్పాటు చేయాలన్నారు. అన్నీ ఆఫీసులు ఇదే విధంగా పెట్టాలి. ఇవన్నీ ప్రజలకు అందుబాటులో వుండాలి. ఆఫీసుల

కొరవ 11వ పేజీలో



జనతా పథకం క్రింద బియ్యాన్ని పేదలకు పంపిణీ చేస్తున్న కౌన్సిలర్ శ్రీధర కృష్ణారెడ్డి.

# వరద నీళ్లన్నీ కడలి పాలు

15రోజుల క్రితం వరకు సోమశిల ప్రాజెక్టులో ఒక్క టిఎంసి నీళ్లు వదలా లన్నా ముఖ్యమంత్రి ఆదేశం కావాలని బెట్టు చేసిన నీటిపారుదల శాఖాధి కారులు; ఎవరి అనుమతి లేకుండానే ఒక్కవారంలో 60టిఎంసిల నీటిని

## సోమశిల నుంచి 60 టి.ఎం.సి.లు

సముద్రం పాలు చేశారు. సోమశిల ప్రాజెక్టులో పూర్తి సామర్థ్యంలో నీళ్లు నిల్వ వుంచే వసతి లేకపోవడం వల్ల లక్షలాది ఎకరాల్లో పంట పండించేందుకు పని కొచ్చే నీళ్లు వృధాగా సముద్రం పాల య్యింది. సోమశిల ఎగువ ప్రాంతాలైన కడప, కర్నూల్ జిల్లాలతోపాటు నెల్లూరు జిల్లాలో గతం వారంలో భారీవర్షాలు పడడంతో పెద్ద మొత్తంలో వరదనీరు ప్రాజెక్టుకు రావడం మొదలయ్యింది. వర్షాలకు పడకముందే 20టిఎంసిల నీళ్లు ప్రాజెక్టులో నిల్వ వుండినాయి. ప్రాజెక్ట ప్రస్తుత సామర్థ్యం 37 టిఎంసిల నీళ్లు. 30 టిఎంసిల సామర్థ్యం నీళ్లు ప్రాజెక్టు చేరగానే పెన్నా డెల్టా ఆయకట్టు కాల్వలన్నింటికి అధికారులు నీటిని విడుదల చేసేశారు. కండలేరును కూడా సాధ్యమైనంత వరకు నింపారు. ఇంకా పై నుంచి నీళ్లు వస్తుండడంతో ప్రాజెక్టులో 35టిఎంసిల నీళ్లు చేరుకోగానే 23తేది ఆకస్మికంగా క్రస్ట్ గేట్లు ఎత్తేసి చేతులు దులుపుకొన్నారు. దీని మూలంగా బుచ్చిరెడ్డి మండలం కొటితర్పం గ్రామంలో నలుగురు పెన్నలో కొట్టుకపోగా,

కొరవ 11వ పేజీలో

# బాధితులతో వైర్‌లెస్ కాన్ఫరెన్స్

జిల్లాలో వర్షాలు, వరదలు వస్తే ప్రజలకు ఏర్పడే ఇబ్బందులపై జిల్లా కలెక్టర్ ప్రవీణ్‌కుమార్, జాయింట్ కలెక్టర్ షంషేర్ సింగ్ రావత్‌లు 28తేది వైర్‌లెస్ సెట్ ద్వారా వరద పీడిత ప్రాంతాల ప్రజలతో మాట్లాడారు. ఆత్మకూరు మండలం వీర్లగుడిపాడుకు వెళ్లే కాజ్‌వే తక్కువ ఎత్తులో ఉన్నందున బొగ్గేరుకు నీరు వస్తే పెన్నానది, బొగ్గేరు మధ్య తాము నీటిలో చిక్కుక పోతున్నామని గ్రామస్తులు జిల్లా అధికారులకు తెలియ జేశారు. నీరొస్తే బయటికి వెళ్లేందుకు ఎత్తుగా ఉండేలా బ్రిడ్జిని నిర్మించా ల్సిందిగా కోరారు. తమ గ్రామంలో వైర్‌లెస్ సెట్‌ను లేదా మైక్రోఫోన్‌ను ఏర్పాటు చేయాల్సిందిగా కోరారు. సంగం మండలం కోలగట్ల వద్ద పార్లుకట్టను నిర్మించాలని అక్కడి ప్రజలు కోరారు. చేజర్ల మండలం పల్లెపాడు గ్రామ రోడ్డును బాగు చేయాల్సిందిగా ఆ ప్రాంత ప్రజలు కోరారు. పుల్లనీళ్లపల్లి వద్ద ఫ్లడ్ ఫ్లోస్లూ యిజ్‌కు మరమ్మత్తులు చేయాలని గ్రామస్తులు కోరారు. కోవూరు మండల పరిధిలోని వేగూరు పంచాయతీకి మజరా

## కలెక్టర్ క్రొత్త ప్రయోగం

వసంతపురం గ్రామంలో 1991 సంవత్స రంలో వరదల కారణంగా ధ్వంసమైన అవుట్ ఫాల్స్ గుండా వరదనీరు ఉప్పెనలా వచ్చి వసంతపురం గ్రామాన్ని ముంచివేస్తోందని దీనికి శాశ్వత పరిష్కారం చేసేలా చూడాలని ఆ ప్రాంత ప్రజలు కలెక్టర్‌ని కోరారు. ఈ సందర్భంగా కలెక్టర్ పంచాయతీ రాజ్, ఇరిగేషన్, రోడ్లు భవనాల శాఖాధికారులు ఈ సమస్యలు పరిష్కరించమని ఆదేశించారు. జాయింట్ కలెక్టర్ షంషేర్ సింగ్ రావత్ మాట్లాడుతూ పెన్న వరద కారణంగా ముంపుకు గురైన గ్రామాల్లో ప్రజలకు ఆరోగ్య పరీక్షలు చేపట్టేందుకు వారం రోజులపాటు వైద్య శిబిరాలు ఏర్పాటు చేసేలా చూడాలని రెవిన్యూ అధికారులు, వైద్యాధికారులను వైర్‌లెస్ సెట్‌లో కోరారు. వరద ముంపుకు పడిపోయిన ఇళ్లకు వెయ్యి రూపాయలు, పాక్షికంగా దెబ్బతిన్న వాటికి 500 రూపాయలు, 20 కిలోల బియ్యం, వంట సామగ్రికి తిరిగి కొనుగోలు చేసుకొనేందుకు వంద రూపాయలు పంపిణీ చేస్తున్నట్లు చెప్పారు. *

# సంగంలో 'హాలిడే' స్కూల్

పక్షం రోజులకొకసారి తెరుస్తున్నారు దీన్ని ప్రత్యేక పాఠాల అనుకోవాల్సిన అవసరం లేదు. దీని పేరే హాలిడే స్కూల్. ఇక్కడ పనిచేసే అయ్యవార్లు మహానుభావులై పోవడంతో దీనికి ఈ దుస్థితి దాపురించింది. ఎక్కడో మారుమూల కుగ్రామంలో కాదు; సంగం మండలం వీర్లగుడిపాడు స్కూల్‌లో ప్రస్తుతం ఈ పరిస్థితి నెలకొనివుంది. ఈ విషయాన్ని గ్రామంలో వరద బాధితుల పరామర్శకు వచ్చిన నెల్లూరు ఎమ్మెల్యే పుక్కాల రాజేశ్వరమ్మకు

## 28 రోజులు మూత రెండు రోజులు తీత

గ్రామస్తులు వివరించారు. స్కూల్‌లో పనిచేసే అయ్యవార్లు పిల్లలకు పాఠాలు చెప్పరని, దీనివల్లే వీరికి పాట్లుపాడిస్తే అక్షరం రాదని ఎమ్మెల్యేకి తమ గోడును వెళ్లబుచ్చారు. సంగం ఎమ్మార్వో, ఎంఈఓకు ఈ అయ్యవార్ల పనితీరుపై ఎన్ని వినతి పత్రాలిచ్చినా ఫలితం లేకుండా పోయిందన్నారు. ఆగష్టు నెలలో మహాకష్టం మీద ఒక రోజు మాత్రమే స్కూల్‌ను తీశారట. చివరికి జెండా పండుగను కూడా ఇక్కడ జరపలేదట. ఇటువంటి అయ్యవార్లపై చర్యలు లేకుంటే ఎలాగండీ సెబట గారు!

## రేబాలలో ఉచిత నేత్ర శిబిరం

బుచ్చిరెడ్డిపాళెం మండలం రేబాల గ్రామంలో 26తేది లయన్స్ క్లబ్ ఆధ్వర్యంలో ఉచిత నేత్ర శస్త్ర చికిత్సా శిబిరం జరిగింది. ఈ సందర్భంగా 727 మంది పరీక్షించి వారికి ఉచితంగా మందులు అందజేశారు. వీరిలో 526 మందికి ప్రత్యేకంగా కంటి పరీక్షలు జరపగా 106 మందికి ఆపరేషన్లు అవసరం ఉన్నట్లుగా గుర్తించారు. వీరికి జిల్లా ప్రభుత్వ వైద్యశాలలో ఆపరేషన్లు నిర్వహిస్తామన్నారు. జిల్లా పరిషత్ పాఠశాల ఆవరణలో జరిగిన ఈ శిబిరానికి కాంగ్రెస్ నాయకుడు ఏటూరి శివరామకృష్ణారెడ్డి సహాయ సహకారాలు అందించారు. ఈ శిబిరంలో డాక్టర్లు బి.కృష్ణమూర్తి, మంజుల, జి.వి. ప్రసాద్ పాల్గొనగా క్యాంప్ ఛేర్మన్‌గా సి.వి.కృష్ణయ్య, సి. రాజగోపాల్‌లు వ్యవహరించారు.

## బుచ్చిలో బంద్ సక్సెస్

హైదరాబాద్‌లో విద్యుత్ ఛార్జీలపై నిరసన తెలుపుతున్న కాంగ్రెస్, వామపక్షాల కార్యకర్తలపై పోలీసు కాల్పులకు నిరసనగా మంగళవారం బుచ్చిలో జరిగిన బంద్ సంపూర్ణంగా

తొరవ 8వ పేజీలో

చేజర్ల మండలం కోటితీర్థంలో పెన్న వరద కారణంగా మృతిచెందిన కుటుంబాలకు ఆర్థిక సహాయం అందజేస్తున్న ఇళ్లమంత్రి ఆదాల ప్రభాకరరెడ్డి, ప్రక్కన మాజీ ఎమ్మెల్యే లక్ష్మయ్యనాయుడు, జిల్లా కలెక్టర్ ప్రవీణ్‌కుమార్.

# బొల్లినేని కనపడ్డాడోచ్!

పెంచిన విద్యుత్ ఛార్జీలకు వ్యతిరేకంగా నడచిన ఉద్యమానికి డుమ్మాకొట్టేసి ఎమ్మెల్యేల నిరాహార దీక్షల శిబిరం వైపు కన్నెత్తి చూడని ఆత్మకూరు ఎమ్మెల్యే బొల్లినేని కృష్ణయ్యను 23తేది కాంగ్రెస్, సిపిఎం కార్యకర్తలు నిలదీశారు. కార్యకర్తల ప్రశ్నలకు స్పష్టమైన సమాధానం చెప్పలేకపోయినా ఎమ్మెల్యే, కార్యకర్తలను బ్రతిమాలి, బామాలి వారితో కలసి తాను బంద్‌లో పాల్గొన్నారు. ఆత్మకూరులోకి ఎమ్మెల్యే కాలుపెట్టాడని తెలియగానే కాంగ్రెస్, సిపిఎం కార్యకర్తలు సోమశిల రోడ్డు సెంటర్‌లో ఆయన్ను నిలేసి ఘెరావ్‌చేశారు. 90 రోజులకు పైగా రాష్ట్రంలో విద్యుత్ ఛార్జీల వ్యతిరేక వుద్యమం జరుగుతుంది. ఎమ్మెల్యేలు 11రోజులుగా ఆమరణ నిరాహార దీక్షలు చేస్తున్నారు. కాంగ్రెస్ ఎమ్మెల్యేగా వుండి వీటిలో పాల్గొనే తీరిక మీకు లేదా? చంద్రబాబుకు తొత్తుగా మారిపోనా మిమ్మల్ని ఎమ్మెల్యేగా గెలిపించిందని కార్యకర్తలు నిలదీసే సరికి కృష్ణయ్య నోటమాట రాలేదు. తాను వ్యక్తిగత పనుల వల్ల వారం పదిరోజులుగా ఏ మాత్రం సమాచారం అందనంత ప్రాంతాల్లో వుండడం వల్ల నిరాహార దీక్షా శిబిరాన్ని సందర్శించలేక పోయానని, విద్యుత్ ఛార్జీలు తగ్గించే

## నిలదీసిన కార్యకర్తలు

వరకు ఇక ప్రతి కార్యక్రమంలో పాల్గొంటానని కార్యకర్తలను నమ్మబలికారు. కొంత మంది కార్యకర్తలను గడ్డం పట్టుకొని బ్రతిమాలాక తమతో కలసి బంద్‌లో పాల్గొనే అవకాశం ఆయనకు కల్పించారు. ఎమ్మెల్యే కార్యకర్తలను నమ్మించాలని కాబోలు ఆత్మకూరు రెవిన్యూ, మండల ప్రజాపరిషత్ కార్యాలయాల్లో చంద్రబాబు బొమ్మలున్న కొన్ని వాల్‌పోస్టర్లను అతి కష్టం మీద చింపారు. బంద్ నిర్వాహకులు హైదరాబాద్‌లో జరిగిన పోలీసు కాల్పుల సంఘటనలు వక్రీకరించి వ్రాశారని ఈనాడు పత్రిక ప్రతులను తగులబెట్టారు.

## ఉరుస్తున్న ప్రభుత్వ కార్యాలయాలు

వెంకటగిరిలో ప్రభుత్వ కార్యాలయాలు నాలుగు వర్షపు చినుకులు రాలిందే తడవుగా ఉరుస్తున్నాయి. ట్రెజరీ, కోర్టు భవనం, మండల ప్రజాపరిషత్, పోస్టాఫీసుల్లో వర్షం పడితే పనులు స్తంభించి పోతున్నాయి. గ్రంథాలయంలో విలువైన పుస్తకాలు వర్షానికి తడిచి నాశనమై పోతున్నాయని గ్రామస్తులు లబోదిబో మంటున్నారు.

తొరవ 8వ పేజీలో

నెల్లూరు జిల్లా దేవాదాయ ధర్మాదాయ శాఖ కార్యనిర్వహణాధికార్ల సంఘం కార్యాలయాన్ని ప్రారంభ ప్రసంగిస్తున్న డిప్యూటీ కమీషనర్ కొన్నా లక్ష్మణ, అసిస్టెంట్ కమీషనర్ కేశవరావు, జిల్లా అసోసియేషన్ అధ్యక్షుడు వేగూరు రవీంద్రారెడ్డి, తదితరులు.

# వరద బాధితులను ఆదుకుంటాం

పెన్నానదికి వచ్చిన వరదల కారణంగా దెబ్బతిన్న గ్రామాలను, చని పోయిన వ్యక్తుల కుటుంబాలను ఇళ్లమంత్రి ఆదాల ప్రభాకరరెడ్డి, జిల్లా కలెక్టర్ ప్రవీణ్‌కుమార్ 26తేది పరామర్శించారు. తొలుత చేజర్ల మండలంలోని నడిగడ్డ అగ్రహారాన్ని సందర్శించి పెన్నానది వరద తీవ్రత గూర్చి గ్రామస్తులను అడిగి తెలుసుకొన్నారు. గ్రామం చుట్టూ పొర్లుకట్టలు ఏర్పాటు చేయాలని ఈ సందర్భంగా మంత్రి అధికారులను ఆదేశించారు. పెరుమాళ్లపాడు గ్రామంలో వరద ప్రవాహానికి కొట్టుకపోయి మృతి చెందిన మహబూబ్ బాషా కుటుంబాన్ని మంత్రి పరామర్శించి, ఆర్థిక సహాయం అందించారు. కోటితీర్థంలో పెన్న వరద తీవ్రతకు కొట్టుకపోయిన నాలుగు కుటుంబాల వారిని మంత్రి పరామర్శించి తాత్కాలిక సహాయంగా ఐదువేల రూపాయలు అందించారు. మృతుల వయస్సు నిర్ధారణ అయిన తర్వాత మేజర్ అయితే లక్ష, మైనర్ అయితే 50వేల రూపాయల సహాయం అందజేస్తామన్నారు. వరద ప్రవాహానికి కొట్టుకపోతూ చివర క్షణాల్లో నాగభూషణం అనే వ్యక్తి సహాయం

## ఆదాల హామీ

మూలంగా ప్రాణాలు కాపాడుకొన్న చేపూరి లక్ష్మికి మంత్రి ధైర్యం చెప్పి, వైద్యం చేయించుకోను 5వేల రూపాయల సహాయం ప్రకటించారు. మంత్రి వెంట ఉదయగిరి ఎమ్మెల్యే కంభం విజయరామి రెడ్డి, ఆత్మకూరు మాజీ శాసనసభ్యుడు కొమ్మి లక్ష్మయ్యనాయుడు, ఎస్‌సి కార్పొరేషన్ ఇడి రఘురామ్, పంచాయతీ రాజ్ ఇ.ఇ. వీరారెడ్డి, ఎమ్మార్వో ఎన్.వి. క్రిష్ణయ్య తదితరులు వెళ్లారు.

## డిపాజిట్ చేయండి - రుణాలు పొందండి!

ఖాతాదారులు డిపాజిట్ చేసిన సొమ్ము మొత్తాన్ని తిరిగి రుణాలుగా ఇస్తామని పినాకినీ గ్రామీణ బ్యాంకు ఛేర్మన్ ఎం. శ్రీహరిప్రసాద్ చెప్పారు. ఉదయగిరి ప్రాంతంలోని నందిపాడు, మర్రిపాడు, పినాకినీ గ్రామీణ బ్యాంక్ శాఖల తనిఖీ నిమిత్తం ఇటీవల వచ్చిన ఛేర్మన్ ఖాతాదారుల నుద్దేశించి మాట్లాడారు. జిల్లా ప్రజలకు పినాకినీ గ్రామీణ బ్యాంక్‌పై వున్న నమ్మకం వల్ల అధిక మొత్తంలో డిపాజిట్లు చేస్తున్నారు. ఈ మొత్తాన్ని తిరిగి వివిధ పథకాలు వృత్తులు, వ్యాపారాల నిమిత్తం విరివిగా

తొరవ 8వ పేజీలో

# బస్సుల్లో 'ఆర్టీసి' వర్షం

ఉదయగిరి ఆర్టీసి బస్సులు వర్షం వస్తే మొత్తం ఉరుస్తున్నాయి. వర్షంలో నిలబడినా, బస్సులో ఎక్కినా ఫలితం ఒకేలాగుంది. ఎక్స్‌ప్రెస్ సర్వీసులు కూడా ఇదే విధంగా వున్నాయి. ఈ డిపోలోని

## జిల్లావార్తలు

బస్సులన్నీ పైనపటారం లోన లొటారంలా సామెతను గుర్తుకు తెస్తున్నాయి. బస్సులు చాలా ఏళ్ల క్రితంవి కావడం వల్ల ఇవి ప్రయాణంలో వేగాన్ని అందుకోలేక పోతున్నాయి. 96 కిలోమీటర్ల దూరంగల నెల్లూరు చేరాలంటే ఈ బస్సుల్లో 4 గంటలు పడుతుంది. అలాగే 85 కిలోమీటర్ల దూరానగల కావలి చేరాలన్నా 4 గంటలే పడుతుంది. ఉదయగిరి డిపో పరిధిలో అతిప్రధానమైన గండిపాళెం రూట్లో సాయంత్రం 7 గంటలు దాటితే బస్సులు లేవు. అదేమిటంటే పోలీసు ఎస్కార్టు సమస్యను సాకుగా చూపిస్తున్నారు. దీనివల్ల నెల్లూరు, కావలి నుంచి చేరిన ప్రజలు కార్లు, జీపులకు ఎక్కువ మొత్తాన్ని చెల్లించి గండిపాళెం వెళ్లాల్సి వస్తుంది. ఉదయగిరి డిపోలోని

తొరవ 7వ పేజీలో

# నెల్లూరు ముచ్చట్లు విశేషాలు

## దొరబాబులైన తాగుబోతులు

గురువారంనాటి మున్సిపల్ కౌన్సిల్ సమావేశానికి మందుబాబులైన కౌన్సిలర్లు బుద్ధిమంతులై, దొరబాబుల్లా వచ్చి కూర్చొన్నారు. తాగుబోతు కౌన్సిలర్లపై గతవారం జమీన్‌రైతులో వచ్చిన వార్తతో, నిషా దిగిందో ఏమో పాపం చుక్క సేవించకుండా సమావేశాలకు వచ్చారు. సహ కౌన్సిలర్లు కూడా వారికి సంతోషంతో అభినందనలు చెప్పినట్టున్నారు. కౌన్సిల్ సమావేశం జరుగుతుండగానే నూనె మల్లిఖార్జున్ యాదవ్ జమీన్‌రైతు పత్రికను చూపించి, ఇక మీదట మనమంతా బుద్ధిగా ఉండాలని చెప్పారు. పత్రికల్లో విమర్శలకు అవకాశం లేకుండా కౌన్సిలర్ల ప్రతిష్ట పెంచేవిధంగా, అభివృద్ధి కార్యక్రమాలను అమలు చేయించాలని అధికార్లను కూడా కోరాడు. మంచిదే కదా!

## అనూరాధమ్మా దప్పిక తీర్చవమ్మా!

నెల్లూరు పట్టణంలో మంచినీటి ఎద్దడి తీవ్రరూపం దాల్చింది. రాష్ట్రంలో ఒక భాగం వరదలతో కకావికలైతే, అదేం దురదృష్టమో నెల్లూరు ప్రజలు మంచినీటికి మొహం వాచిపోయి ఉన్నారు. మొన్నటికి మొన్న, పెన్నానది పొంగిపొర్లింది. రెండు సోమశిల రిజర్వాయర్లకు సరిపడా నీటిని సముద్రంలో కలిపేసింది. అయినా నెల్లూరు ప్రజల దప్పిక తీరడం లేదు. పెన్న వరదల వల్ల మున్సిపల్ బావుల్లో నీళ్లు ఊరినా, అధికారుల నిర్లక్ష్యం పుణ్యమా అని ప్రజల గొంతు ఎండుతోంది. వాటర్ వర్క్స్‌లో మోటార్లు చెడిపోవడంతో మంచినీరు అందించలేకున్నామని చెప్పి చేతులెత్తేశారు. దీంతో సగభాగం నెల్లూరు పట్టణానికి నీరందడం లేదు. అరకొరగా నీటి సరఫరా జరుగుతున్న ప్రాంతాల్లో కొళాయిల్లో మురికినీరే వస్తోంది. మున్సిపల్ ఛైర్‌పర్సన్ అనూరాధకు ప్రజాసేవకంటే 'పతి' రాజకీయ సేవ ఎక్కువైంది. పగలు పొద్దస్తమానం, తమ వర్గానికి చెందిన కౌన్సిలర్లను కూర్చోబెట్టుకొని రాజకీయాలు చేయడం, తగాదాలు పెట్టుకోవడం తప్ప, ఇటీవల కాలంలో ఆమె ప్రజలకు మేలు చేసే పనులేకాదు, మాటలు కూడా మర్చిపోయింది. ఇప్పటికైనా మించిపోయింది లేదు 'పతిదేవుడి' వర్గరాజకీయ పోరాటాల నుంచి బయటపడి ఓటేసిన జనం గురించి ఆలోచించవమ్మ అనూరాధమ్మా! నెల్లూరులో పాడైపోయిన రోడ్లను ఎటూ బాగుచెయ్యలేరు. ముక్కుపుటాల నదరగొట్టి వాంతులు చేసుకొనే విధంగా ఉన్న చెత్తా చెదారాన్ని తొలగించలేరు. కనీసం బావుల్లో ఉన్న మంచినీళ్లయినా ప్రజలకిచ్చి పుణ్యం కట్టుకోండమ్మా!

## కోటంరెడ్డి అరెస్ట్ 15రోజులు రిమాండ్

ఆల్మట్టి ఫేం కాంగ్రెస్ యువనేత కోటంరెడ్డి శ్రీధర్‌రెడ్డిని గురువారం ఉదయం పోలీసులు అరెస్ట్ చేసి, సాయంత్రానికి కోర్టుకు హాజరు పెట్టారు. మెజిస్ట్రేట్ శ్రీదేవి ఆయనకు 15రోజుల రిమాండ్ విధించి, జైలుకు పంపారు. కరెంట్ ఛార్జీలకు వ్యతిరేకంగా మంగళవారం జరిగిన బంద్‌లో శ్రీధర్‌రెడ్డి విధ్వంసక చర్యలకు పాల్పడ్డాడన్నది పోలీసుల ఆరోపణ. జిల్లా కలెక్టర్ కార్యాలయంపై తమ సమక్షంలోనే ఆయన ఆయన నల్లజెండా ఎగురవేశాడన్న కోపంతో పోలీసులు, మరో నాలుగైదు తప్పుడు కేసులు పెట్టి జైలుకు పంపించారు. పాకిస్తాన్ తీవ్రవాదిని పట్టి తీసుకపోతున్నంత హంగామాతో పోలీసులు ఆయనను కోర్టుకు పెట్టారు. కోర్టు నుంచి జైలుకు తాను జీపులో రానని నడిచే పోతానని పోలీసులతో వాదించి శ్రీధర్‌రెడ్డి జైలు వరకు నడిచే పోయాడు. ఆయన అరెస్ట్‌కు నిరసనగా గాంధీబొమ్మ సెంటర్ వద్ద శ్రీధర్ బ్రాండ్ యువజన కాంగ్రెస్‌యులు నిరాహార దీక్ష చేస్తున్నారు. శ్రీధర్‌రెడ్డి అరెస్ట్ విషయాన్ని నెల్లూరు ఎమ్మెల్యే వివేకానందరెడ్డి శాసనసభ జీరో అవర్‌లో కూడా ప్రస్తావించారు.

## నెల్లూరులోదుర్గామిట్టఅనే ప్రాంతమొకటుందా?

నెల్లూరు టౌన్ దక్షిణ ప్రాంతాన్ని దర్గామిట్ట అనే పేరుతో పిలుస్తారు. అధికారికంగా అదే పేరు రికార్డులలో నమోదై వుంది. కానీ ఈ మధ్య మతపిచ్చిగాళ్లు కొందరు దానిని దుర్గామిట్ట అని పేరు మార్చి పిలుస్తున్నారు. ఇది పిలుపులకే పరిమితం కాకుండా పోస్టల్ స్టాంపులపై కూడా చోటు చేసుకొంది. కవర్‌పై దర్గామిట్ట పోస్టాఫీసు వాళ్ళ ముద్రచూస్తే దుర్గామిట్ట (Durgamitta) అని వుంది. ఆ పోస్టాఫీసులో మతతత్వవాదులెవరున్నారో వారి దుష్కృత్యం ఇది. మౌనం వహించక పోస్టల్ సూపర్నెంటుగారు విచారించి దర్గామిట్టగానే ముద్రించే ఏర్పాటు చేసి, ఈ కార్యం ఎవరిదో కనుక్కొని వారిని మందలించండి.

## అసెంబ్లీలో గళం విప్పిన ఎమ్మెల్యేలు

విద్యుత్ ఛార్జీల పెంపకం, ఛలో అసెంబ్లీలో కాల్పుల సమస్యపై చర్చ ముగిశాక నెల్లూరుజిల్లా ఎమ్మెల్యేలు 31తేది గళం విప్పారు. స్వర్ణముఖి, పెన్నా నదుల పొర్లుకట్టలకు మరమ్మత్తులు చేయాల్సిన అవసరం వుందని దీనికి నిధులు మంజూరు చేయమని గూడూరు శాసనసభ్యుడు బల్లి దుర్గాప్రసాద్ ప్రభుత్వాన్ని కోరారు. జిల్లాలోని తీరప్రాంతాల్లో చెరువులను ఆక్రమించుకొని రొయ్యలు, చేపల గుంటలు వేస్తున్నారని వీటిని అరికట్టాలని సర్వేపల్లి శాసనసభ్యుడు సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి ప్రభుత్వానికి విజ్ఞప్తి చేశారు. జిల్లాలో వరద బాధితులకు తక్షణం సాయం చేయాలని వెంకటగిరి శాసనసభ్యురాలు నేదురుమల్లి రాజ్యలక్ష్మమ్మ శాసనసభలో గట్టిగా కోరారు.

నెల్లూరు ఎమ్మెల్యే వివేకానందరెడ్డి కూడా జీరో అవర్‌లో తన గళం విప్పారు.

## ఆదాలరాక

ఇళ్లమంత్రి ఆదాల ప్రభాకరరెడ్డి 2తేది నెల్లూరు వస్తున్నారు. ఉదయం 10గంటలకు సోమశిల అతిథి గృహంలో అధికారులతో సమావేశమై ఆ తర్వాత అల్లూరు బయలుదేరి వెళ్తారు. ఇస్కపల్లిలో ప్రాథమిక ఆరోగ్య కేంద్రం ప్రారంభోత్సవం, సాయంత్రం పార్టీ కార్యకర్తల సమావేశంలో పాల్గొని రాత్రికి స్వగ్రామం నార్తుమోపూరులో బసచేస్తారు. 3తేదీ దగదర్తి మండల పరిధిలోవున్న కావలి నియోజక వర్గ గ్రామాల్లో వివిధ అభివృద్ధి కార్యక్రమాల ప్రారంభోత్సవాల్లో పాల్గొంటారు. రాత్రికి బిట్రగుంటలో హైదరాబాద్ ఎక్స్‌ప్రెస్ ఎక్కుతారు.

## పిల్లల పార్కును తెరవండి

చింతారెడ్డిపాళెం డొంకలో ప్రతిష్టాకరంగా నిర్మించిన చిన్న పిల్లల పార్కును జూన్ 8తేది లాంఛన ప్రాయంగా ప్రారంభించి ఆ తర్వాత మూసేశారు. పార్కు ఏర్పాటుకు కృషి చేసిన కలెక్టర్ శ్రీలక్ష్మి మారిపోవడంతో పార్కు ప్రారంభం ఎప్పటికప్పుడు వాయిదాపడుతూ వుంది. ఈ నేపథ్యంలో కొత్త కలెక్టర్, జాయింట్ కలెక్టర్లు 27తేది చిల్డ్రన్స్ పార్కును స్వయంగా చూశారు. 2తేది కలెక్టర్ అధ్యక్షతన జిల్లా టూరిజం అభివృద్ధి మండలి సమావేశం జరుగుతున్నందున ఈ సమావేశంలో పార్కును ప్రజల కోసం తెరచి వుంచేందుకు సరైన నిర్ణయం తీసుకొంటే బాగుంటుంది.

పార్కు నిర్వహణ బాధ్యతలు చేపట్టడానికి పర్యాటక శాఖకు ధైర్యం చాలడం లేదు. ఈ నేపథ్యంలో దీని నిర్వాహణ బాధ్యతను ప్రయోగాత్మకంగా పార్కు దాత జె.ఎస్.రెడ్డి చేతికి అప్పగిస్తే బాగుంటుంది. ఈ విషయమై పార్కు అభివృద్ధి కమిటీ ఒక తీర్మానం చేస్తే సబబుగా వుంటుంది. చిన్న చిన్న సాకులతో పార్కును లాంఛనంగా ప్రారంభించిన మూడు నెలలవుతున్నా ప్రజల సందర్శనకు అడ్డంకులు పెట్టడం సబబుకాదు కలెక్టర్‌గారు!



గాయకుడు మహమ్మద్ రఫీ పుట్టినరోజు వేడుకలను నెల్లూరులో ప్రతి యేడాది క్రమం తప్పక నిర్వహిస్తున్న జాకీర్ హుస్సేన్‌ను సన్మానిస్తున్న డాక్టర్ నయీం, ప్రక్కన యాదే రఫీ కార్యక్రమంలో యాంకర్ మానస.

## ఉచితంగా జె.ఇ. వాక్సిన్

నెల్లూరు పొగతోటలోని రవి చిన్న పిల్లల ఆసుపత్రిలో ఉచితంగాపిల్లలకు మెదడువాపు వ్యాధి నిరోధక టీకాలు వేసే కార్యక్రమాన్ని 27తేది నెల్లూరు ఎమ్పీ డాక్టర్ వుక్కాల రాజేశ్వరమ్మ ప్రారంభించారు. ఈ కార్యక్రమంలో డాక్టర్ ప్రకాశరావు, డాక్టర్ రవి, ఆయన సతీమణి వసంత లక్ష్మి పాల్గొన్నారు. జె.ఇ. వాక్సిన్ వున్నంత వరకు ప్రతి ఆదివారం తెల్లకార్డుగల ప్రజలకు దీన్ని వుచితంగా వేస్తారు. అరుదైన ఈ అవకాశాన్ని ప్రజలు ఉపయోగించుకోవాల్సి వుంది.

## మహమ్మద్ రఫీ మ్యూజికల్ నైట్

మధుర గాయకుడు మహమ్మద్ రఫీ స్మృత్యర్థంగా ప్రతియేడు 'యాదేరఫీ' పేరిట ఆయన అభిమాని జాకీర్‌హుస్సేన్ చక్కని కార్యక్రమం ఏర్పాటు చేస్తున్నాడు. ఏడవ ఏట 26తేది కస్తూర్బా కళాక్షేత్రం జరిగిన ఈ కార్యక్రమానికి హాలు పట్టనంతగా జనం వచ్చారు. వేకువన మూడు వరకు జరిగిన ఈ కార్యక్రమంలో కడ వరకు వందల మంది మహిళలు కూడా వుండడం విశేషమనాలి. రఫీ పాడిన పాటలను వర్ధమాన గాయకులు జీలా, బాబు, అహ్మద్ షరీఫ్, మున్నా, జావీద్, ఖలీల్, అస్లం సాహెబ్, అల్లాబక్షు, మహబూబ్ బాషా, షఫీ, గీత, సుజాత, శైలజ, లీలావతి మధురంగా ఆలపించారు. మిస్ మానస వ్యాఖ్యానం కార్యక్రమాన్ని రక్తి కట్టించింది.

## తగ్గిన వినాయకచవితి హడావుడి

నెల్లూరు టౌన్‌లో వినాయక చవితిని పురస్కరించుకొని వివిధ సెంటర్లలో ఏర్పాటు చేసే వినాయక విగ్రహాల హడావుడి ఈ యేడాది తగ్గింది. ఎప్పటి నుంచో ప్రతియేడు భారీ స్థాయిలో వినాయక విగ్రహం ఏర్పాట్లు చేసే పొగతోట సెంటర్‌లో ఈ యేడాది ఉత్సవ కళ లేకుండా బోసిపోయింది. సీమా సెంటర్‌లో మొట్టమొదటిసారిగా లక్ష 20వేల గాజులతో ఏర్పాటు చేసిన వినాయక విగ్రహాన్ని ప్రత్యేకంగా చెప్పుకోవాల్సిందే!

## టెలిఫోన్ అడ్వయిజరీ కమిటీ సోమిరెడ్డి పరం

జిల్లా టెలిఫోన్ అడ్వయిజరీ కమిటీ తన వర్గీయులను ఎక్కువ సంఖ్యలో వుండేట్లు సర్వేపల్లి శాసనసభ్యుడు సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి చేసుకొన్నారు. సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి ఇచ్చిన లిస్టులో తన గ్రామస్తులను కొందరిని కలిపి కేంద్ర కమ్యూనికేషన్ల మంత్రి పాశ్వాన్‌కు ఎమ్పీ వుక్కాల రాజేశ్వరమ్మ ఇచ్చినట్లుంది. దాని ప్రకారంగానే కమిటీలో కిలారి వనజాక్షి, నువ్వుల మంజుల, మేరిగ మురళి, బి.శ్రీకాంత్ వంటి చంద్రమోహన్‌రెడ్డి వర్గీయుల పేర్లు ముందున్నాయి. మిగతా సభ్యులు డాక్టర్ మోహన్‌బాబు, బెజవాడ ఈశ్వరమ్మ, కోడూరు వెంకటకృష్ణారెడ్డి, స్వర్ణా వెంకయ్య, హైదర్‌అలీ, శీలం కిరణ్‌కుమార్, ప్రతాప్‌కుమార్, ఆర్. సుందరరామిరెడ్డి, ఐ. శీతమ్మ వున్నారు.

## చవగ్గా గ్యాస్

జిల్లా పౌరసరఫరాల శాఖ నేతృత్వంలో ఇండియన్ గ్యాస్ చవకగా అందిస్తున్నారు. బుకింగ్, వెయిటింగ్‌ల వంటి పనులు లేకుండా అప్పటికప్పుడే సిలిండర్లు ఇచ్చేస్తున్నారు. ఈ అవకాశం ఆగష్టు 31తేది నుంచి సెప్టెంబర్ 30తేది వరకు మాత్రమే అమలులో వుంటుంది. నెల్లూరీయులు రేషన్‌కార్డు కానీ, నివాస ధృవీకరణ పత్రం గానీ ఇచ్చి, 2,500 రూపాయలు కడితే అప్పటి కప్పుడు రెండు ఇండేన్ గ్యాస్ సిలిండర్లు, రెగ్యులేటర్ ఇచ్చేస్తారు. దీని విషయమై ఇతర వివరాలను అయ్యప్పగుడి వద్ద నున్న ఇండేన్ గ్యాస్ గోడౌన్ వద్దగాని, 331981, 331301 ఫోన్ నెంబర్లకు ఫోన్ చేసి గానీ తెలుసుకోవచ్చు.

## రక్తదానం

ప్రపంచ ఫోటోగ్రఫీ దినోత్సవం సందర్భంగా నెల్లూరుటౌన్ ఫోటో గ్రాఫర్స్ అసోసియేషన్ ఆధ్వర్యంలో రక్తదానం చేశారు. ఈ సందర్భంగా కో ఆపరేటివ్ సెంట్రల్ బ్యాంక్ నుంచి రెడ్‌క్రాస్ బ్లడ్ బ్యాంక్ వరకు ఊరేగింపుగా వెళ్లారు.

## పద్మనాభరావు తండ్రి మరణం

నెల్లూరు జిల్లా గూడూరు వాస్తవ్యుడు, ఆల్ ఇండియా రేడియో న్యూఢిల్లీ స్టేషన్ డైరెక్టర్ డాక్టర్ ఆర్. పద్మనాభరావు తండ్రి లక్ష్మీకాంతారావు

తరువాయి 7వ పేజీలో

## జిల్లావార్తలు

5వ పేజీ కొరవ

దక్కు బస్సులను మార్చుకుంటే, ప్రైవేట్ బస్సులు ఊపందుకోవడం ఖాయం.

### పంచాయతీల్లో పట్టుకోసం పాట్లు

ఉదయగిరి నియోజకవర్గంలో పంచాయతీ ఎన్నికల్లో పట్టు సాధించేందుకు తెలుగుదేశం, కాంగ్రెస్ నేతలు కసరత్తులు ప్రారంభించారు. ఈ వ్యవహారంలో కాంగ్రెస్ నాయకుడు మేకపాటి శేఖర్‌రెడ్డి ఒకడుగు ముందు కేశారని చెప్పవచ్చు. వారం పది రోజులుగా శేఖర్‌రెడ్డి ఉదయగిరిలో మకాంపెట్టి పిలిచిన పేరంటానికల్లా హాజరై అక్కడ మాటా మంతీలో పోటీకి అర్హులైన వారి కూపీలాగుతున్నారు. దేశం నేత కంభం విజయరామిరెడ్డి తన వద్దకు వస్తున్న వారి వద్ద నుంచి గ్రామాల్లో పరిస్థితిని తెలుసుకొంటున్నారు. ముఖ్యంగా ఇరుపార్టీల నాయకులు ఉదయగిరి, సీతారామపురం, వరికుంటపాడు, మర్రిపాడు, వింజమూరు, దుత్తలూరు, బసినేనిపల్లి, గండిపాళెం, జడదేవి, రామాపురం, బిజ్జలపల్లె పంచాయతీలపై ముఖ్యంగా దృష్టి కేంద్రీకరించి వున్నారు. తెలుగుదేశం పార్టీకి వ్యతిరేక వాతావరణం నెలకొనివున్న ప్రస్తుత తరుణంలో ముందునుంచి ప్రచారం ప్రారంభిస్తే పరిస్థితి బాగుంటుందన్న అభిప్రాయంతో మేకపాటి శేఖర్‌రెడ్డి తెలివైన ఎత్తుగడలు వేస్తున్నారు. వీటిని కంభం విజయరామిరెడ్డి, మాదాల జానకిరాం ఏవిధంగా ఎదుర్కొంటారన్నది ఎన్నికల ప్రకటన వెలువడితేగాని తేలదు.

### పంచాయతీ నిధుల గోల్మాల్

వింజమూరు మండలం అలగానిపాడు గ్రామసర్పంచ్ గ్రామ అభివృద్ధికి మంజూరైన అన్ని రగాల నిధులను ధైర్యంగా స్వాహా చేశాడు. జిల్లా పంచాయతీ అధికారి కార్యాలయంలోని ఉద్యోగస్తులకు సైతం ఇతను తను తిన్న ప్రజల సొత్తులో భాగం ఇవ్వడం వల్ల ఇతనిపై ఎటువంటి చర్యలు తీసుకోనట్లు తెలిసింది. స్వాహా చేసిన వాటిలో సెన్ట్ ఫైనాన్స్, జెఆర్‌వై రోడ్ల మరమ్మత్తులకు మంజూరైన నిధులతోపాటు ఇఎస్‌ఐ నిధులు కూడా వున్నట్లు తెలిసింది. సర్పంచ్ కోవూరు ఎమ్మెల్యే ప్రసన్నకుమార్‌రెడ్డి అనుచరుడు కావడం వల్ల అతను ఆడిందేఆట పాడిందే పాటగా వుంది. ఎంత ఎమ్మెల్యే అనుచరుడైనా లక్షలాది రూపాయలు భోంచేస్తే జిల్లాలో అడిగే అధికారే లేడా?

### పాతబస్టాండ్ సొగసు చూడతరమా?

గూడూరు మునిసిపాలిటీ పరిధిలోని పాత బస్టాండ్‌లో నాలుగు చినుకులు రాలితే నరమానవుడెవ్వరు కాలుపెట్టలేని పరిస్థితి నెలకొంటుంది. మోకాలులోతు బురద నిత్యం వుంటుంది. ఎవరైనా ధైర్యం చేసి కాలుపెడితే ఇక రూపు రేఖలు మారి పోవాల్సిందే. పాత బస్టాండ్ సొగసును మునిసిపల్ ఛైర్మన్ కల్పలత, ఆర్టీసీ సుబ్రహ్మణ్యం రెడ్డి, మునిసిపల్ కమీషనర్ ఇటీవల స్వయంగా చూసి ఆశ్చర్యపోయారు. వెంటనే మడుగులా మారివున్న బస్టాండ్ రూపురేఖలు మారుస్తామన్నారు. మరి ఈ పని ఎప్పటికి చేస్తారో ప్రజలు ఎప్పుడు ఈ బస్టాండులోనికి కాలు పెట్టాలో అర్థం కాని పరిస్థితి ప్రస్తుతముంది.

### వేళకు నడవని రాపూరు డిపో బస్సులు

రాపూరు డిపోలో బస్సులను సమయానికి నడపక పోవడం వల్ల ప్రయాణీకులు ఇబ్బందులు పడుతున్నారు. డిపోలోని ఏ ఒక్క సర్వీసు టైమ్‌కు నడవడం లేదు. ఉదయం పాయింట్‌లోకి వచ్చి నిలబడాల్సిన ఎక్స్‌ప్రెస్ సర్వీసులు మధ్యాహ్నం, మధ్యాహ్నం రావాల్సిన సర్వీసులు సాయంత్రానికి వస్తున్నాయి. అదే కడప జిల్లా రాజంపేట డిపోకు చెందిన బస్సులు ఖచ్చితమైన సమయంలో వుంటున్నాయి. బస్సులు వస్తాయో రావో చెప్పను డిపోలో కంట్రోలర్ కూడా అందుబాటులో వుండరు. ఎవరైనా గట్టిగా నిలదీస్తే సాంకేతిక కారణాల వల్ల ఈ విధంగా జరిగిందని డిపో అధికారులు తప్పించుకోవాలని చూస్తున్నారు. నెల్లూరు ఆర్టీసి రీజియన్ మేనేజర్ ఒకసారి రాపూరు డిపోను సందర్శిస్తే బస్సులు ఏ విధంగా నడుస్తున్నాయో అర్థమై పోతుంది.

### కలువాయిలో ఉచిత డయాబెటిక్ శిబిరం

నెల్లూరు లయన్స్ క్లబ్ కలువాయి గ్రామంలో 28తేది ఉచిత డయాబెటిక్ శిబిరాన్ని నిర్వహించింది. నెల్లూరులోని ప్రముఖ డయాబెటిస్ట్ డాక్టర్ సత్యనారాయణమూర్తి 100 మందికిపైగా రోగులను పరీక్షించడం తోపాటు ఉచిత రక్త పరీక్షలు జరిపి, మందులు కూడా ఉచితంగా ఇచ్చారు. ఈ శిబిరాన్ని నికోలస్ పిరామిల్ ఇండియా లిమిటెడ్ వారు స్పాన్సర్ చేశారు. శిబిరంలో క్లబ్ అధ్యక్ష, కార్యదర్శులు ఉదయభాస్కర్, కార్యదర్శి ఎవిఆర్ మోహన్‌రావు, కోశాధికారి ఎస్వీ ప్రసాద్, నికోలస్ కంపెనీ ప్రతినిధి రఘునాథ్ పాల్గొన్నారు.

### ఆత్మకూరులో ఉచిత వైద్య శిబిరం

ఆత్మకూరు ప్రభుత్వ జూనియర్ కాలేజీలో 27తేది విశ్వాస్ సేవా సంస్థ ఉచిత కంటి వైద్య శిబిరాన్ని ఏర్పాటు చేసింది. శిబిరంలో 360 మంది రోగులను డాక్టర్లు పరీక్షించారు. వీరిలో 70 మందికి కంటి ఆపరేషన్లు చేయాలని తీర్మానించారు. శిబిరంలో అమెరికన్ ఆసుపత్రి ఇన్‌ఛార్జ్ డాక్టర్ దేవరాజ్‌పూలా, డాక్టర్ బి. సుందరరామిరెడ్డి, రవీంద్రనాథ్ రెడ్డి, బి. సుధాకర్‌రెడ్డి పాల్గొన్నారు.

## సణుగుడు

2వ పేజీ కొరవ

తొందరపాటు పనికి క్షమాపణ చెప్పడం, వారికే గౌరవం. పత్రికా రంగంలోని ప్రతి వారు ఈ దౌర్జన్యాన్ని ఖండించాలి. అయితే ఈనాడు యాజమాన్యం కూడా తమ సంపాదకీయ విధానాల రూపకల్పనలో వ్యాపార, వ్యక్తిగత ప్రయోజనాలతో పాటుగా కొంత ప్రజా ప్రయోజనం సైతం పరిగణనలోకి తీసుకోవడం సముచితం. తెలుగు జర్నలిజాన్ని చారిత్రాత్మక మలుపు తిప్పిన రామోజీరావు గారికి, ప్రపంచ పత్రికా రంగంలోనే సమున్నత స్థానం సాధించిన ఈనాడు పత్రికకు బుద్ధులు నేర్పే స్థాయి, అంతస్థు, అర్హత నాకు లేవన్న సంగతి నాకు బాగా తెలుసు. వారి సంపాదకీయ విధానం వారి ఇష్టమే తప్ప ఇతరుల మాట వినవల్సిన అవసరం లేదన్న సంగతి కూడా తెల్సిన విషయమే. కాని ఈనాడు ఇప్పుడు ఒక యాజమాన్యానికి పరిమితమైనది కాదు; అది ఒక ప్రజా సంస్థ; ప్రజలు తమ సమాచార అవసరాలకోసం గుడ్డిగా ఆధారపడుతున్న వ్యవస్థ. కాగితపు రూపాయల రూపంలో దాని లాభ నష్టాలు మాత్రమే రామోజీరావు గారికి చెందుతాయి; భావ పరంగా, భావనల పరంగా కలిగే ప్రతి మంచికి, చెడుకు, చలనానికి, జడత్వానికి స్వంతదారులు తెలుగు ప్రజలు. అది ఒక సామాజిక ఆస్తిగా రూపాంతరం చెందింది. ఎంతో అదృష్టం చేసుకొంటే తప్ప అటువంటి ఘనతర సంస్థను సృష్టించే భాగ్యం వ్యక్తులకు కల్గదు. అటువంటి భాగ్యశీలతను చరిత్రలో చిరస్థాయిగా నిల్పుకొనేందుకు రామోజీరావు గారు వ్యక్తుల పట్ల అభిమాన దురభిమానాలు వదులు కోవడం చాలా అవసరం. ఆ మార్పు ఆయనలో కల్గితే ఈనాడు దిన పత్రిక ప్రజల చేతులలో నుంచి, జన హృదయాలలోకి వెళ్లి పోతుంది; పదికాలాల పాటు పదిలంగా వుండి పోతుంది.

## చరిత్ర

2వ పేజీ కొరవ

అక్కడే వీరు తమ తొలి ఫ్యాక్టరీ కట్టారు. కాని కొద్ది కాలంలోనే గోల్కొండ రాజ ప్రతినిధుల వేధింపులు భరించలేక 1612లో వీరు కూడా డచ్ వారి ప్రక్కనే పులికాట్‌లో ఒక ఫ్యాక్టరీ నిర్మించారు. అయితే డచ్, ఇంగ్లీషు వ్యాపారుల మధ్య స్నేహం ఎక్కువ కాలం నడవ లేదు. 1623లో వీరి మధ్య జరిగిన పోరాటం అంబోయిన (తూర్పు ఇండియా దీవులు) హత్యాకాండకు దారి తీసింది. దానితో వీరు తమ వ్యాపార స్థావరాన్ని 1625లో దుగరాజపట్నానికి సమీపంలోని అర్మగాన్ దీవికి మార్చారు. అప్పటి దుగరాజపట్నం గ్రామ కరణం ఆర్మగం; అతడు వీరు తమ గ్రామాలలో వ్యాపార స్థావరం పెట్టుకోవడానికి సహాయ పడినందు వల్ల వీరు దానికి అర్మగాన్ దీవి అని పేరు పెట్టారు. ఇది వెంకటగిరి జమీందారులకు చెందిన భూమి. ఈ దీవి పట్ల ఇంగ్లీషు దొరలకు చాలా మక్కువ. మొత్తం తూర్పు తీరంలో తుఫాను గాలుల నుంచి నౌకలను రక్షించగల ఒకే ఒక స్థలం అర్మగాన్ "అని ప్రశంసించాడు ఆనాటి ఈస్ట్ ఇండియా కంపెనీ ప్రెసిడెంట్ మార్కలీన్.

కొద్ది కాలంలోనే వీరికి, వెంకటగిరి జమీందారులకు దోస్తి కుదిరింది. అయితే ఇంగ్లీషు వారు ఇక్కడ ఫ్యాక్టరీ కట్టకుండా ఆటంకపరచడానికి డచ్ వ్యాపారులు చాలా ప్రయత్నించారు. జమీందారీ సంస్థాన ఉద్యోగులను లోబరుచుకొని, వారికి లంచాలు ఇచ్చి ఇబ్బందులు సృష్టించారు. అయితే ఇంగ్లీషు దొరలు కూడా పోటీలు పడి లంచాలు ఇచ్చి సమస్యలను అధిగమించేవారు. వెంకటగిరిలోని ఒక స్థానిక నాయకుడికి డచ్ వారు రెండు తుపాకులు లంచంగా ఇస్తే, ఇంగ్లీషు వారు ఏకంగా ఒక ఫిరంగి బహూకరించి తమకు అనుకూలం చేసుకున్నారు. ఈ గందరగోళంలో కరణం ఆర్మగం సహకారం ఇంగ్లీషు వారికి ఎంతో వుపకరించింది.

1626 మార్చి 21తేది మచిలీపట్నం ఇంగ్లీషు వారి ప్రతినిధిగా వుండిన థామస్ మిల్ ఆర్మగం దీవికి వచ్చాడు. వచ్చీ, రాగానే ఆయన ఆర్మగన్ దీవిలో ఒక కోట నిర్మిస్తే తమకు ఎంతో ఉపయోగపడుతుందని గ్రహించి తమ కంపెనీ ప్రధాన కార్యాలయానికి తెలియచేశాడు. మనం ఇక్కడ కోట నిర్మించగల్గితే స్థానికంగా వుండే అన్ని రకాల ప్రజలను ఆకర్షించగలం, తద్వారా ఇక్కడి ప్రభుత్వాన్ని సైతం హస్తగతం చేసుకోగలం అని తమ కంపెనీ అధికారులకు వ్రాశాడు థామస్. వ్యాపారం ద్వారా ఇంగ్లీషు వారు సాధించదలిచిన రాజకీయ పెత్తనకాంక్షను ఈ వాక్యం వ్యక్తం చేస్తున్నది.

వెంకటగిరి జమీందారులు వీరికి కోట నిర్మించుకునేందుకు అనుమతి ప్రసాదించారు. భారత దేశంలో బ్రిటీష్ పరిపాలన ప్రారంభం కావడానికి నాంది ప్రస్తావన జరిగింది ఈ అనుమతి తోనేనడం నిజం. బ్రిటీష్ వాళ్లు భారత దేశంలో నిర్మించిన తొలి కోట - ఆర్మగన్. తాము చేసే దిగుమతుల మీద ఒక శాతం, ఎగుమతుల మీద మూడు శాతం పన్ను వెంకటగిరి జమీందారులకు చెల్లించే ఒప్పందం మీద వీరు ఈ కోట నిర్మించుకున్నారు. కొద్దికాలంలోనే వీరు జమీందారులను ఒప్పించి, తమ స్వంత నాణాలు ముద్రించుకునే అధికారం కూడా పొందారు. వీటిని పగోడాలు, పనాలు అనేవారు. ప్రతి నాణెం విలువపై ఒకటిన్నర శాతం పన్ను చెల్లించే ఒప్పందంతో వీరికి ఈ అధికారం ఇచ్చారు జమీందారులు.

1628లో మచిలీపట్నంలోని తమ ఫ్యాక్టరీని పూర్తిగా మూసివేసి, మొత్తం కార్యకలాపాలు ఆర్మగానికి తరలించారు. ఇది వారికి సురక్షిత స్థావరంగా కన్పించింది. 1641లో మద్రాస్ నగరానికి తరలి వెళ్లేంత వరకు ఆర్మగం దీవి వీరి ప్రధాన కార్యస్థావరం.



పాగతోట సెంటర్‌లో హర్ష రెస్టారెంట్‌ను ప్రారంభిస్తున్న మునిసిపల్ ఛైర్మన్ అనూరాధ. ప్రక్కన రమేష్‌రెడ్డి, రెస్టారెంట్ అధినేత సతీష్‌రెడ్డి వున్నారు.

1634లో ఆర్మగాన్ వర్తక స్థావరానికి ఫ్రాన్సిస్‌డే అనేవాడు ప్రెసిడెంట్‌గా వుండేవాడు. ప్రెసిడెంట్ పదవి వీరి వ్యాపారంలో చాలా కీలకమైనది. ఈ ప్రెసిడెంట్ల పేరు మీదే మద్రాస్ ప్రెసిడెన్సీ, కలకత్తా ప్రెసిడెన్సీ, బాంబే ప్రెసిడెన్సీ వంటివి ఏర్పడ్డాయి.

రక్షణ కోసం ఆర్మగన్‌లో బలమైన దుర్గం నిర్మించుకున్నా, ఆర్థిక పరంగా ఆనాటికి ఇంగ్లీషు వారి కంటె పులికాట్‌లోని డచ్‌వారు ధనికులు. దానితో వారు నేతపని వారికి ఇంగ్లీష్ దొరల కంటె ఎక్కువ కూలీలు ఇచ్చి నేసిన వస్త్రాలన్నీ తామే తీసుకవెళ్లేవారు. ఈ పోటీ తట్టుకోవడం ఫ్రాన్సిస్‌డేకు సాధ్యం కాలేదు. పైగా ఆర్మగాన్ రేవులో తుఫాన్ వచ్చి, ఇసుక మేట వేసింది. దానితో నౌకల రాకపోకలు కష్టమైనాయి. ఇంకొక ప్రక్క వెంకటగిరి జమీందారీ వుద్యోగులు తరచూ లంచాల కోసం వేధించడం ప్రారంభించారు. ఈ చికాకులు తప్పించుకోవడానికి, వ్యాపారంలో డచ్చి వారి పోటీ ఎదుర్కోవడానికి వేరే స్థలానికి వలస పోవాలని నిర్ణయించాడు ఫ్రాన్సిస్‌డే. ఆయన దృష్టి మద్రాస్ మీద పడింది.

అప్పటికి అది చాలా చిన్న పట్టుపుపాళెం. దాన్ని చెన్నకుప్పం అని పిలిచేవారు. కాళహస్తి జమీందారు దామెర్ల వెంకటాద్రి నాయుడు స్వాధీనంలో వుండింది అది. ఫ్రాన్సిస్ డే ఆయన్ను ఒప్పించి చెన్నకుప్పాన్ని తీసుకున్నాడు. ఆ గ్రామంలో వీరు ఒక కోట నిర్మించుకోవడానికి, పన్ను లేకుండా కోట లోపల కార్యకలాపాలు నిర్వహించుకోవడానికి, స్వంత నాణాలు ముద్రించుకోవడానికి అనుమతి ఇచ్చాడు కాళహస్తి జమీందారు. 1640లో ఇక్కడ కోట నిర్మాణం పూర్తిచేసి ఆర్మగం, పులికాట్ దీవులలోని తమ ఫ్యాక్టరీలను మద్రాసుకు తరలించాడు ఫ్రాన్సిస్‌డే. ఆర్మగం స్థావరం నుంచి బ్రిటిష్ వారి వస్తువులను తరలించుకోవడానికి 2000 పగోడాల సుంకం వసూలు చేశాడు వెంకటగిరి జమీందారు. 1640నుంచి మద్రాస్ వీరికి ప్రధాన వ్యాపార కేంద్రమైంది; ఆర్మగం పాడు పడిపోయింది.

## నెల్లూరుముచ్చట్లు

6వ పేజీ కొరవ

(80) ఢిల్లీలో ఆగష్టు 5తేద మరణించారు. ఇటీవల బైపాస్ చేయించుకొన్న అనంతపద్మనాభనావుకు తండ్రి మరణం తీరనిలోటు. వారికి మా సానుభూతి.

# శివశక్తి సమన్వితం- గుడిమల్లం క్షేత్రం

**వాస్తుసంగతులు**
**ఆచార్య సుబ్రహ్మణ్య మహర్షి**

ప్రపంచంలోని అరుదైన ఆలయం, గుడి మల్లం పరశురామేశ్వర క్షేత్రం. స్త్రీ, పురుష సంగమ 'పవిత్ర'తను అద్వైత స్థితిలో తెలియజెప్పిన శిలా సదృశ్య రూపం ఈ శివలింగాకృతి.

ఇక్కడి శివలింగం పురుష అంగాకృతిలో వుంటుంది. ప్రపంచ చరిత్రకారుల దృష్టి నాకర్షించిన ఈ శివలింగం చూచితరించవలసిందే! పరమపావన మైన క్షేత్రం తిరుపతికి 18కి.మీ దూరంలో పాపానాయుడు పేటకు సమీపంలో ఈ శివక్షేత్రం వెలసింది.

పాపానాయుడు పేట వరకూ బస్సు సౌకర్యం వుంది. అక్కడి నుంచి 4 కి.మీ. దూరం నడిచి ఈ క్షేత్రాన్ని చేరవలసి వుంది. మధ్యలో 'సువర్ణ ముఖి'ని దాటాలి. ఈ ఆలయాన్ని పల్లవరాజులు నిర్మించారు. కాబట్టి గుడిపల్లం, 'గుడిమల్లం' అయిందంటారు.

పరశురాముడు, రాక్షసుడితో జరిపిన యుద్ధంలో ఈ ప్రాంతం పల్లం అయిందని చివరికి రాక్షసుణ్ణి అణగద్రొక్కి, పరశురాముడు విజయం సాధించాడని అందువల్ల పల్లం, 'మల్లం' అయిందని మరొక కథనం.

అయితే శాసనాల్లో మాత్రం ఈ గ్రామాన్ని 'విప్పిరంబేడు', తిరువిప్పిరంబేడు అగ్రహారంగా పేర్కొన్నారు.

*విగ్రహ వర్ణనం!*

స్త్రీ, పురుష సంగమ పవిత్రతను తెలియజెప్పడమే 'శివలింగం' ప్రత్యేకత అని ప్రాచీన గ్రంథాలు చెబుతున్నాయి.

శివలింగం 'పానవట్టం' లోంచి తలయెత్తి నిలుస్తుంది. పానవట్టం, శివలింగాలు స్త్రీ, పురుష అంగ ప్రతి రూపాలని శాస్త్రాలు చెబుతున్నాయి. అద్వైత స్థితిలో భక్తుడికి దైవానికి గల సన్నిహిత్వమే 'లింగరూపం' అంటారు పెద్దలు.

శివలింగం నల్లని గ్రానైటు రాతితో చెక్కబడింది. ఊర్ధ్వరేత పురుష అంగాకృతి విస్పష్టంగా కనిపిస్తుంది. రాతిపైని నునుపుదనం ధగధగలతో మెరుస్తూ వుంటుంది. లింగం 4, 4.5 అడుగుల ఎత్తులో 2 అడుగుల వెడల్పుతో వుంది.

మధ్యలో పరశువును ధరించిన వ్యక్తి కుడిచేతిలో జింకను, ఎడమచేతిలో నీటి కుండను ధరించి కనిపిస్తాడు. చెవికి కుండలాలు, మెడలో హారాలు, మూచేతికి కడియాలు, ధోవతి, ధోవతి లోపలి నుంచి 'అంగం' కనిపిస్తుంది. ఇది మంగోలాయిడ్ ఆటవిక మానవుడి చిత్రం అంటారు. కొందరు చరిత్రకారులు. ప్రథమంలో ఈ శిల్పం నాలుగు రోడ్ల కూడలిలో వుండి జంతు, మానవ బలులను స్వీకరించేదని కూడా స్థల పురాణాలు చెబుతున్నాయి.

*ఆలయవర్ణన!*

శివాలయానికి పశ్చిమ దిశలో ప్రవేశ ద్వారం, గోపురం వున్నాయి. శివుడు తూర్పు దిశాభిముఖంగా వున్నాడు. అతనికి అభిముఖంగా బలిపీఠం, ధ్వజస్తంభం వున్నాయి. ఆలయం చుట్టూ ఇటుక ప్రాకారం వుంది. ఆలయంలో ప్రదక్షిణ పథం, అంతరాళం, గర్భగృహం వున్నాయి. గోడలపై నృత్యగణపతి, కుమారస్వామి విగ్రహాలున్నాయి. ప్రదక్షిణ ద్వారం ముందు 16స్తంభాల ముఖమండపం వుంది. గాలి రావడానికి రాతి కిటికీని ఏర్పాటు చేశారు. గర్భగృహం 12 అడుగుల పొడవు, 10 అడుగుల వెడల్పు కలిగి వుంది. గర్భగృహం గజపృష్టాకారంలో వుంది. ఇది పల్లవ నందివర్మ నిర్మితం.



కోడూరు గ్రామస్థుడు, విలేకరి వల్లూరు నూధవరావు కుమార్తె వెంకట భవానీ శంకరి, పవన్‌కుమార్‌ల వివాహం ఆగస్టు 18 తేది నెల్లూరులో జరిగింది.

*పరిసర ఆలయాలు!*

మయూర వాహన సుబ్రహ్మణ్య స్వామి వల్లీ దేవి ఆలయంలో క్రీ.శ. 9, 10 శతాబ్దాల చోళశిల్పం కనిపిస్తుంది. క్రీ.శ. 13 శతాబ్ది చివరిలో నిర్మించిన దేవి ఆలయంలో 'ఆనందవల్లి అమ్మన్' 'త్రిభంగ మూర్తి' స్వరూపంలో కనిపిస్తుంది. దీన్ని యాదవ దేవరాయలు నిర్మించాడు. సూర్య దేవాలయం క్రీ.శ. 10వ శతాబ్దిలో చోళపరాంతకుని కాలంలో కట్టబడింది.

*శాసనాలు!*

ఇక్కడ అతిపురాతనమైన శాసనం పల్లవుల కాలం నాటి క్రీ.శ. 802 చెందినదిగా కనిపిస్తున్నది.

శాతవాహనుల దళాధిపతి ఆకాశ రాజా తొండమాన్ శాసనాలు (పద్మావతి దేవి తండ్రి) ఇక్కడ వున్నాయి. పల్లవ బాణ, యాదవ, చోళ, విజయనగర శాసనాలు మొత్తం 66 వున్నాయి. క్రీ.శ. 845 నాటికి ఈ ప్రాంతం జయగొండ చోళ మండలంలో వుండేదని ఒక శాసనం పేర్కొంటున్నది. ఇది విజయదంతి వర్మ కాలం నాటిది. బాణరాజు రెండవ విక్రమాదిత్యుని తామ్ర శాసనంలో ఈ ప్రాంతాన్ని 'విప్రపీఠం' ప్రశంసించారు.

క్రీ.శ. 989 మొదటి చోళరాజు రాజచోళుని శాసనం ప్రకారం ఈ ఆలయం 4వ సంవత్సరం పరిపాలనా కాలంలో అనేక అభివృద్ధి కార్యక్రమాలకు నోచుకున్నది.

క్రీ.శ. 1127 విక్రమ చోళుని శాసనంలో ఈ దేవుడు మహదేవ పరమేశ్వరుడుగా పేర్కొనబడ్డాడు. ఈతని 8 సంవత్సరాల పరిపాలనా కాలం నాటి శాసనం దేవాలయం అధిష్టానంపై కనిపిస్తుంది.

క్రీ.శ. 1232లో మూడవ రాజేంద్ర చోళుడు తన 16వ సంవత్సరం పరిపాలనా కాలంలో తిరుమంజన సేవకై 'బావిని' నిర్మించినట్లు శాసనం వుంది.

ఇక్కడ భారత పురావస్తు శాఖ ఆధ్వర్యంలో క్రీ.శ. 1973 - 74 సంవత్సరంలో త్రవ్వకాలు జరిగాయి. శాతవాహనుల కాల్చిన ఇటుక, పంచ్ మార్క్ నిర్మాణాలు, ఇతర మృణ్మయ పాత్రలు లభించాయి.

*సలక్షణ వాస్తు!*

ఆగమ శాస్త్ర విరుద్ధమైన ఒక్క అంశం తప్ప ఆలయ వాస్తు మిక్కిలి ప్రశస్తంగా వుంది. సామాన్యంగా తూర్పుకు అభిముఖంగా విగ్రహం, విగ్రహానికభిముఖంగా బలిపీఠం, ధ్వజస్తంభం వుంటాయి. కాని ఇక్కడ తద్విరుద్ధంగా పశ్చిమ ద్వార ప్రవేశం, గోపురం వున్నాయి.

శాస్త్రాలలో అగస్త్య మహర్షి చేత 'సువర్ణ ముఖరిప్రాత మనుజాభీష్ట దాయిని'గా ప్రశంసించబడిన 'స్వర్ణముఖి' నది గుడి మల్లానికి ఉత్తరవాహిని అయ్యి, దిశాప్రవాహిని అయ్యి తూర్పు, ఉత్తర ఈశాన్యాల్ని తాకుతూ 'మహావైభవస్థితి'ని కల్పించింది. అందువల్లే ఈ శివలింగం ప్రపంచ విఖ్యాతమయ్యింది. ఉత్తరం పల్లమై, దక్షిణం సమున్నతమై 'సమస్థితి'ని ఆకర్షణనూ తెచ్చి పెట్టింది. ఇంద్ర స్థానం నుంచి సూర్యకిరణ ప్రవాహం ఆలయ ప్రవేశం చేసి ఆలయ స్థితిని 'ఆవాహం' చేసింది.

దక్షిణ, పశ్చిమ దిశల్లో, నైరుతిలో నిర్మాణాలు ఆలయానికి 'ఉచ్ఛస్థితి'ని కల్పించాయి. అధిష్టానం ఇంద్ర స్థానానికి 'సమతులం'గా నిర్మింపబడి దైవాన్ని శక్తి సమన్వితుణ్ని చేసింది. అందువల్లే శివుడు మహిమాన్వితుడయ్యాడు. *



రవి చిన్నపిల్లల ఆసుపత్రిలో ఉచితంగా మెదడువాపు వాక్సిన్‌ను వేస్తున్న డాక్టర్ రవి. ప్రక్కన ఆయన భార్య వసంతలక్ష్మి, నెల్లూరు ఎమ్మే రాజేశ్వరమ్మ, ఆమె భర్త ప్రకాశరావు.

## ఆదుకుంటాం

5వ పేజీ కొరవ

రుణాలిచ్చేందుకు నిర్ణయం తీసుకొన్నట్లు చెప్పారు. అత్యవసర పరిస్థితుల్లో పొదుపులక్ష్మి గ్రూపు సభ్యులు కూడా తమ ఖాతాలోని సొమ్ము డ్రా చేసుకొని అవసరాలు గడుపుకొనే వీలు కల్పిస్తాం. అయితే ఆయా గ్రూపు అధ్యక్ష, కార్యదర్శుల అనుమతి ముందుగానే ఆ శాఖ మేనేజర్ తీసుకోవలసి వుంటుందన్నారు. బ్యాంకింగ్ రంగంలో సేకరించిన డిపాజిట్లలో 60శాతం మేరకు మాత్రమే రుణాలివ్వాలనే నిబంధన వున్నప్పటికీ రికవరీలు బాగా వున్నందున ఈ నిర్ణయం తీసుకొన్నామన్నారు. ప్రకృతి వైపరీత్యాల వల్ల రుణాలు మాఫీ అవుతాయనే భ్రమలో ఖాతాదారులుండ వద్దని, అలాగే సబ్సిడీపై ఆశలు వద్దని ఛైర్మన్ చెప్పారు. నందిపాడు బ్రాంచీలో విధులకు సక్రమంగా హాజరుకాని ఫీల్డ్ ఆఫీసర్‌ను ఛైర్మన్ మందలించారు.

## సంగం

5వ పేజీ కొరవ

విజయవంతం అయ్యింది. సామాన్యంగా బంద్ అంటే మెచ్చని సామాన్యులు, వ్యాపార వర్గాలు ఈసారి స్వచ్ఛందంగా పాల్గొని, వారి అంగళ్లను వారే మూసేశారు. మంగళవారం ఉదయం నుంచి సిపిఎం, కాంగ్రెస్ కార్యకర్తలు ప్రధాన మార్గాల గుండా రాకపోకలను స్తంభింపజేశారు. సిపిఎం కార్యకర్తలు కొందరు ఎన్‌ఆర్‌టిసి బస్సు అద్దాలు, పంచాయతీ ట్రాక్టరును ధ్వంసం చేశారు. ముంబాయి రోడ్డులో ప్రైవేటు బస్సులకు గాలితీసేశారు. ప్రభుత్వ, ప్రైవేటు కార్యాలయాలన్నీ మూతపడ్డాయి. మధ్యాహ్నం మూడు గంటల వరకు సిపిఎం, కాంగ్రెస్ కార్యకర్తలు ప్రధాన కూడళ్లలో సిఎంకు వ్యతిరేకంగా నినాదాలు చేశారు. సినిమాహాళ్ల యజమానులు సైతం రెండు ఆటలు నిలిపివేశారు. కార్యక్రమంలో కాంగ్రెస్ నాయకులు శివకుమార్‌రెడ్డి, కృష్ణమోహన్‌రెడ్డి, బాబు, రామచంద్రయ్య, సిపిఎం నాయకులు వెంకమరాజు, భాస్కర్, రోశయ్య తదితరులు పాల్గొన్నారు.

## గళమెత్తిన బుచ్చి కాంగ్రెస్

గత కొంత కాలంగా ఇళ్ల మంత్రి ఆదాల ప్రభాకరరెడ్డి దెబ్బకు స్తబ్దుగా వున్న బుచ్చిరెడ్డిపాళెం కాంగ్రెస్ నాయకులు విద్యుత్ ఛార్జీలకు నిరసనగా ఒక్కసారిగా గళం విప్పారు. గురువారం కాంగ్రెస్ నాయకులు చేపట్టిన బిజిలీ బంద్ కార్యక్రమం విజయవంతం అయ్యింది. గతంలో విద్యుత్ ఛార్జీలకు వ్యతిరేకంగా జరిగిన బంద్‌లో కాంగ్రెస్ వారు నామమాత్రంగా పాల్గొన్నా, ఈ విడత అందరూ ఏకతాటి మీద నడిచి బుచ్చిలో సైతం గట్టి ప్రతిపక్షం వుందని నిరూపించారు. గురువారం బిజిలీ బంద్ సందర్భంగా సాయంకాలం ఏడు నుంచి ఎనిమిది వరకు స్థానిక సబ్‌స్టేషన్‌ను కాంగ్రెస్ నాయకులు ముట్టడించి విద్యుత్ సరఫరాను నిలిపివేశారు. ఆ సమయంలో జొన్నవాడ పర్యటనలో వున్న గవర్నర్ దంపతులు కూడా కొద్ది సేపు ఇబ్బందులు పడ్డారు.

అనంతరం 300మంది దాకా కాంగ్రెస్ నాయకులు, కార్యకర్తలు "ప్రపంచ బ్యాంక్ బ్రోకర్, చంద్రబాబు లోఫర్" అను నినాదాలతో పోలీసు స్టేషను వరకు ర్యాలీ నిర్వహించారు. తదుపరి పెంచిన విద్యుత్ ఛార్జీలకు నిరసన తెలుపుతూ ఎస్ఐకి మెమోరాండం సమర్పించారు. స్తబ్దుగా వున్న కాంగ్రెస్ నాయకులలో ఒక్కసారిగా చైతన్యం రావడంతో స్థానిక కార్యకర్తలలో ఉత్సాహం వెలకొంది. కార్యక్రమంలో మండల కాంగ్రెస్ పార్టీ ఇన్‌ఛార్జ్ మేనకూరు సీతారామిరెడ్డి తోపాటు లేబూరు సురేష్‌రెడ్డి, యరటపల్లి శివకుమార్‌రెడ్డి, వింజమూరు వెంకటేశ్వర్లు, మమోల మహల్ బాబు, చౌదరి, షాహుల్ అల్లాబక్షు, తన్నీరు నరసింహారావు, బాలకృష్ణయ్య తదితర కాంగ్రెస్ నాయకులు పాల్గొన్నారు.

## బొల్లినేని

5వ పేజీ కొరవ

ఈ కార్యాలయాలకు మరమ్మత్తులు చేయించాల్సిన బాధ్యత ప్రభుత్వానికి లేదంటారా?

# ప్రేమంటే తెలియని భామను

ప్రేమ అన్న పదానికి అర్థమే తెలియదని, ప్రేమించిన అనుభవం బొత్తిగా లేదని చెబుతోంది హీరోయిన్ మీనా. అందువల్ల ప్రేమ గురించి ఎక్కువగా మాట్లాడటం కూడా చేత కాదని చెప్పింది. తనకు హీరోయిన్ రోజాకు మధ్య గొడవున్నట్లు ఈ మధ్య

## మీనా డంబాలు

పత్రికల్లో వచ్చిన వార్తలు నిజం కాదంటుంది మీనా. పరిశ్రమలో నాకు ఎవరితోనూ గొడవలు లేవు. గొడవలు పడే మనస్తత్వం కాదు. రోజా నేను కలసి నటించే అవకాశాలు ఇటీవల రాలేదు కాబట్టి నటించలేదు తప్ప మరొకటి కాదన్నారు. కుష్బూ, కాలినీల పెళ్ళిళ్లగూర్చి చెప్పి మీ పెళ్లెప్పుడన్న ప్పుడు మీనా ఆ ముహూర్తం ఇంకా దరి చేరలేదంది. నాకు కాబోయే భర్త మంచి మనిషిగా, నన్ను అర్థం చేసుకొనే వ్యక్తిగా, ప్రేమించే వ్యక్తిగా వుండాలి.

### ఇక్కడంతా మంచోళ్లే

సినిమా పరిశ్రమలోనికి ప్రవేశించక ముందు సినిమా వాళ్లంటే తనకు తక్కువ అభిప్రాయం వుండేదని గ్లామర్ హీరోయిన్ రంభ చెప్పింది. నా ఫ్రెండ్స్ సినిమా పరిశ్రమలోని హీరోయిన్ గూర్చి వ్యాఖ్యానిస్తూ ఏవేవో కామెంట్ చేస్తుంటే నేను వాళ్లతో కలిసి ఎంజాయ్ చేశాను. కాని నేను స్వయంగా పరిశ్రమకు వచ్చాక వాస్తవాలు తెలుసుకొన్నాను. బయట వినిపించేవన్నీ గాలి కబుర్లే. ఇక్కడ అందరూ కష్టపడి పనిచేస్తారు. ఎవరి పనిలో వాళ్లు బిజీగా వుంటారు. ఇతర

తరువాయి 11వ పేజీలో

# దారితప్పాను దిగజారాను

సినిమా రంగంలో తన పతనానికి తానే కారణమంటుంది రోజా. నటించేందుకు అవకాశంలేని గ్లామర్ రోల్స్ ఒప్పుకోవడం నేను చేసిన మొదటి తప్పు. మధ్యలో ఇమేజ్ మార్పు కోసం ప్రయత్నించాను. అది తిప్పికొట్టింది. అటు గ్లామర్ వేషాలు, ఇటు యాక్షన్ రోల్స్ దూరమయ్యాయి. ఇమేజ్ మార్పు కోసం సమరం, పోలీస్ లాకప్ సినిమాలు తీసి

## రోజా ఆవేదన

చేతులు కాల్చుకున్నాను. నేను పరిశ్రమలో వచ్చిన పదేళ్లలో ఎన్నో ఎగుడు, దిగుళ్లు, ఎత్తుపల్లాలు చవిచూశాను. ఉన్నత స్థాయిలో వున్నప్పుడు చాలా మంది ఆర్టిస్టులకి, దర్శకులకు వ్యక్తిగతంగా, వృత్తి రీత్యా సాయపడ్డాను. ఇవాళ నాకు ఎవరూ అవకాశం ఇచ్చి తోడ్పడడం లేదు; సానుభూతిని మాత్రం వ్యక్తం చేస్తున్నారని వాపోయింది. భగవంతుడు దయ వుంది కాబట్టి ప్రస్తుతం తన చేతిలో పది చిత్రాలు వున్నాయని చెప్పింది. వీటిలో ఏడు తమిళ చిత్రాలున్నాయి.

### రెహ్మాన్ కోసం ఆగిన రజనీ

రజనీకాంత్ ఇటీవల నటించిన ముత్తు, అరుణాచలం, నరసింహ చిత్రాలకు సంగీత దర్శకుడు రెహ్మాన్ బాణీలందించారు. ఆ చిత్రాలు మ్యూజికల్ హిట్లు కావడంతో రెహ్మాన్ మీద రజనీకాంత్‌కు ప్రత్యేక గురి ఏర్పడింది. రెహ్మాన్ తన తదుపరి చిత్రానికి సంగీతం సమకూర్చినాకే ఆ చిత్రం షూటింగ్ మొదలు పెడతానని రజనీకాంత్ ప్రకటించారు. ప్రస్తుతం రెహ్మాన్ లండన్‌లో ఒక ఆంగ్ల నాటకానికి సంగీతాన్నందించే పనిలో బిజీగా వున్నారు. రెహ్మాన్ తిరిగి వచ్చి సంగీతం సమకూర్చాకే రజనీ తదుపరి చిత్రం ప్రారంభమవుతుంది.

# వేషాలపై యుక్తా ఆసక్తి

విశ్వ సుందరులు ఐశ్వర్యారాయ్, సుస్మితాసేన్ బాట మరో సుందరి యుక్తాముఖి కూడా నడుస్తుంది. యుక్తా ప్రపంచ సుందరి కాగానే, హీరోయిన్ అవ్వాలన్న ఆశ వుందా అంటే; నేను హీరోయిన్ అవ్వాలంటే నా కన్నా పొడుగ్గా వుండే హీరోలు కావాలి కదా

## హైదరాబాదు సినిమా వార్తలు

అంటూ పరోక్షంగా తన మనసులో దాగివున్న ఆర్టిస్ట్ కావాలన్న ఆశని బయట పెట్టింది. ఈ మధ్యే హీరోయిన్‌గా రంగ ప్రవేశం చేయడానికి అవసరమైన సన్నాహాలు చేసుకొంటుంది. దీనిలో భాగంగా గతంలో ఐశ్వర్యారాయ్ సెక్రటరీగా పనిచేసిన జతిన్‌రామ్ గురుని తన మేనేజర్‌గా పెట్టుకొంది. వైవిధ్యంగా వున్న చిత్ర కథలను ఎన్నుకొంటానంటుంది యుక్తా. కొత్త హీరోలు అభిషేక్ బచ్చన్, హృతిక్ రోషన్‌లతోపాటు పాత హీరో సల్మాన్‌ఖాన్ పొడుగ్గా ఉన్నారు కాబట్టి తనకు అవకాశాలొస్తాయని యుక్తా ధీమాను వ్యక్తం చేసింది.

### గాయని మరణం

హిందీ గాయని నాజియా హస్సేన్ ఆగష్టు 13తేది క్యాన్సర్ వ్యాధితో లండన్‌లో కన్నుమూసింది. నాజియా 'ఆప్‌జైసా కోయీ మేరే జిందగీమే ఆయేతో', 'డిస్కో దివానే' పాటలతో ప్రజల హృదయాలు దోచుకొంది. హిందీలో తొలిసారిగా యంగ్ తరంగ్ పేరిట పాప్ ఆల్బమ్‌ను విడుదల చేసింది.

### దేవుడంటే భక్తి

నేను పదవ తరగతి చదువుకొనే రోజుల్లో పరీక్ష పాసవ్వాలని నా మిత్రులంతా గుడికి వెళ్లి కొబ్బరికాయలు కొట్టి వస్తుంటే ఆశ్చర్యపోయేదాన్ని. మనం చదివితే కదా పరీక్షల్లో పాసయ్యే

తరువాయి 11వ పేజీలో

అదిగో- అతనే చిత్రంలో సుమన్, మణిచందన

# మడికట్టుకుంటే గుడికి పోవాల్సిందే

సినీ రంగంలో హీరోయిన్‌లు మడి కట్టుకొని కూర్చుంటూ వుంటే గుడిలో పూజలు చేసుకోవలసిందేనని ఆశాషైనీ చెబుతోంది. వంపు సొంపుల్ని ఊద్చి ప్రేక్షకులకు ఇవ్వనిదే లాభం లేదంది.

"చాలా బాగుంది", "మనసున్న మారాజు", "అంతా మన మంచికే" చిత్రాల్లో నటించిన ఆశాషైనీ గ్లామర్ హీరోయిన్‌గా చక్కని గుర్తింపు తెచ్చుకొంది. బొంబాయి భామ ఆశా వెండి తెరపై అందాలు ప్రదర్శించడంలో తనకేమీ అభ్యంతరం లేదంటుంది. నటి అన్న తర్వాత దర్శకుడు ఏం చెప్పినా చేయాలి. కథకు, తగ్గట్టుగా కేరక్టర్ నడవకపోతే సినిమా రాణించదు. స్విమ్ సూటే కాదు, మరే డ్రస్సు దర్శకుడు వేసుకోమన్నా వేసుకొంటాను. మడిగట్టుకొంటే వేషాలు రావు. గ్లామర్‌ను ప్రదర్శించి పెద్ద హీరోయిన్ అయిపోదామనే ఆశలేవీ లేవు. ఆశాషైనీ మంచి హీరోయిన్ అన్న గుర్తింపు దొరికితే చాలంటుంది.

## తారల ఎక్స్‌పోజింగ్‌పై ఆశాషైనీ అభిప్రాయం

### నాన్నే నాకు ఆదర్శం

ఆగష్టు 29తేది హీరో అక్కినేని నాగార్జున జన్మదినం. ఈ సందర్భాన్ని పురస్కరించుకొని ఆయన అభిమానుల కోసం నాలుగు మాటలు చెప్పమని కోరాను. దీనికి జవాబుగా నా మనసుకు నచ్చనిపని ఎప్పుడూ చేయనన్నారు. ఒక విధంగా చెప్పాలంటే తన మనసే తనకు గైడ్ అన్నారు. అక్కినేనితో తనకున్న అనుబంధం గూర్చి చెబుతూ, నాన్నగారి మాటలను ఎప్పుడూ కాదన్లేదు. ఆయనేది చెప్పినా అన్నీ ఆలోచించి మంచికే చెప్తారని తెలుసు. ఆయన అభిప్రాయాలు, నా అభిప్రాయాలు చాలా వరకు కలుస్తాయి. ఆయన మాటను ఇంత వరకూ వ్యతిరేకించిన సందర్భం లేదు; భవిష్యత్తులో రాదు. ఆయన ఒక ఎన్సైక్లోపీడియా. అదేవిధంగా మా అమ్మ, నా భార్య అమల కూడ నా అభివృద్ధికి చక్కని సలహా లిచ్చే గొప్ప వ్యక్తులు. అందుకే వారిద్దరన్నా తనకు ఎనలేని అభిమానమన్నారు నాగార్జున.

# 'చూసొద్దాం రండి' చూసిరండి

## చిత్రసమీక్ష

* * *

గ్రిద్దలూరు గోపాలరావు

ఇద్దరు హీరోలు, ఒక హీరోయిన్ మధ్య నలిగిన ప్రేమను పుణికి పుచ్చుకొని "చూసొద్దాం రండి "చిత్రం ఆకారం నిర్మించుకొంది. ఇద్దరు హీరోలు ఒక హీరోయిన్, ఒక హీరో ఇద్దరు హీరోయిన్లు వీరిలో కలిగి, పెరిగే ప్రేమను పులుము కొని ఇంతవరకు చాలా చిత్రాలు వచ్చాయి. ఈ ప్రేమ పాత బడి పోయింది. కాని "చూసొద్దాం రండి "చిత్రంలో ప్రేమ కొంత కొత్త తరహాగా సాగుతుంది. ఈచిత్రంలోని ఒక హీరో, హీరోయిన్‌ను చిన్న నాటినుంచి ప్రేమిస్తాడు. రెండోహీరో మధ్యలో సందు చేసుకొని ఆమెను ప్రేమిస్తాడు. ఇద్దరు హీరోలు ఒక హీరోయిన్ను పెళ్ళి చేసుకోలేరు కదా! అందువల్ల ప్రేమను త్యాగం చేసేందుకు ఇద్దరూ హీరోలు పోటీ పడతారు. మధ్యలో వచ్చిన హీరో మంచి మనసుతో మధ్యలోనే దూరమై పోతాడు. మెదటి హీరో ప్రేమ ఫల ప్రథమవుతుంది. ఈ ప్రేమ కథా చిత్రాన్ని చూసొద్దాంరండి అని మన బంధు మిత్రులనందరిని ధైర్యంగా పిలవొచ్చు. ఎందుచేతనంటే ఇందులో కథ కొత్త విధానం అనుకరిస్తుంది. కథనం, ఇద్దరు హీరోలు, హీరోయిన్ పాత్రలను, అపురూపమైన అనురాగాల మధ్యగట్టిగా నడిపించింది. వారి మధ్య ఒదిగి ఎదిగిన పవిత్ర ప్రేమను వైవిధ్యంగా ప్రదర్శించింది. రచయిత రాజేంద్రకుమార్ ప్రేమను గూర్చి వెలువరించిన అభిప్రాయాలను అనుసరించి దర్శకుడు రాజావన్నెంరెడ్డి సన్నివేశాలకు కల్పించిన దృశ్యమాలికలు నేరుగా ప్రేక్షకుల హృదయాలను తాకుతాయి. హాస్యానికి, సెంటిమెంటుకు ప్రాధాన్యత పెరిగి అలరిస్తాయి. ఎం.ఎం.కీరవాణి సంగీతం; వేటూరి, సిరివెన్నెల పాటలతో జోకొట్టుంది. కె.ప్రసాద్ కెమెరా కళా రూపాలను కన్నులకు కట్టుంది. తన తొలి ప్రయత్నమైన "క్షేమంగా వెళ్లి లాభంగా రండి"తో మెరుగైన దర్శకుడుగా పేరుగాంచిన రాజా వన్నెంరెడ్డి తన ఈ మలి ప్రయత్నంలోను, ముఖ్యంగా హాస్యానికి ప్రాధాన్యతనిచ్చి మొత్తం చిత్రాన్ని రుచికరం చేసి విజయం సాధించాడు. ఈ విధంగా అన్ని విధాలా ముచ్చటగా ముస్తాబైన ఈ చిత్రాన్ని చూచొచ్చిన ప్రేక్షకుడు తాను పెట్టిన టికెట్ డబ్బుకు నష్టం కలగలేదంటూ సంతోషిస్తాడు.

కథ రాజేంద్రకుమార్ వ్రాశాడు. బాబు (శ్రీకాంత్ )తన చిన్న తనంలో తన అక్కకూతురు గీతను (రంభ) ప్రేమగా చూచుకుంటాడు. పెద్దయిన తర్వాత ఆమెనే పెళ్ళి చేసుకోవాలనుకుంటాడు. గీత కోసం ఆట బొమ్మలు సేకరించటంలో ఒక నేరంలో చిక్కొన్న బాబు జైలు శిక్షకు గురవుతాడు. ఆ సంఘటనతో అతనికి తన అక్క కుటుంబంతో సంబంధం తెగిపోతుంది. కాని గీత పై అతని ప్రేమ బంధం బలమవుతూ వుంటుంది. శిక్ష తర్వాత బాబు మరో ఊరు వచ్చి అద్దె ఇళ్ళ బ్రోకరగా పని చేస్తూ ధర్మ (పొన్నాంబళం) అనే అతని ఇంటిలో వుంటాడు. అతని మిత్రుడు (సుధాకర్) అతనితోనే వుంటాడు.

ధర్మ స్త్రీ లోలుడు . అవివాహిత స్త్రీలను మాత్రమే వెంటాడు తుంటాడు. వివాహిత స్త్రీల జోలికి పోడు. ఓ నేరం

తరువాయి 11వ పేజీలో

# వారఫలాలు

*2-9-2000తేది నుండి 8-9-2000తేది వరకు వృషభంలో గురు, శనులు; మిధునంలో రాహువు; కర్కాటకంలో కుజుడు; 7తేది నుండి సింహంలో కుజుడు; సింహంలో రవి బుధులు; 4తేది నుండి బుధుడు కన్యలో; కన్యలో శుక్రుడు; ధనుస్సులో కేతువు; తులా, వృశ్చిక, ధనుస్సులలో చంద్రుడు.*



## మేషం

(అశ్విని, భరణి, కృత్తిక 1వ పాదం)

వృత్తి, వ్యాపార, పారిశ్రామిక రంగాలలో ఆదాయం బాగుంటుంది. కాని అనుకోని ఖర్చులు కూడా ఎక్కువగా ఉంటాయి. ఆరోగ్యం సరిగా ఉండదు. విసుగు, శ్రమ, కోపం ఎక్కువగా ఉంటుంది. జీవిత సహచరులకు కొద్ది అనారోగ్యం ఉంటుంది. విద్యాభివృద్ధి బాగుంటుంది. అధికారుల ఆదరణ ఉద్యోగులకు బాగుంటుంది. సాంకేతిక రంగంలో వారికి అవకాశాలు బాగుంటాయి. అనుకున్న పనులు నిదానంగా జరుగుతాయి.



## వృషభం

(కృత్తిక2,3,4పాదాలు, రోహిణి, మృగశిర 1,2 పాదాలు)

ఆర్థిక పరిస్థితి బాగుంటుంది. ఆదాయం పెరుగుతుంది. వృత్తి, వ్యాపార శ్రమ పెరుగుతుంది. అధికారుల సహకారం బాగుండి ఉద్యోగ బాధ్యతలు నెరవేర్చుతారు. శుభకార్యాలలో పాల్గొనడం జరుగుతుంది. అనవసర విషయాలలో ప్రవేశం వద్దు. శుభకరమైన వార్తలను వింటారు. అనుకున్న పనులు సవ్యంగా జరుగుతాయి. కుటుంబ సౌఖ్యం ఉంటుంది.



## మిధునం

(మృగశిర3,4పాదాలు, ఆర్ద్ర, పునర్వసు 1,2,3 పాదాలు)

అనుకోని ఖర్చుల వల్ల ఆర్థికంగా, తాత్కాలిక ఇబ్బందులు పడతారు. వృత్తి, వ్యాపార రంగాలలో ఆదాయం బాగుంటుంది. వ్యవసాయ వర్గానికి కొంచెం నష్టం ఉంటుంది. అధికారుల తోడ్పాటుతో ఉద్యోగ బాధ్యతలు నెరవేర్చుతారు. వారం మధ్యలో ఆరోగ్య లోపం ఉంటుంది.



## కర్కాటకం

(పునర్వసు 4 పాదం, పుష్య, ఆశ్రేషలు)

కుటుంబ విషయాలలో సభ్యులతో విభేదాలుంటాయి. వృత్తి, వ్యాపార విషయాలలో సలహాలు పొందుతారు. ఆర్థిక పరిస్థితి బాగుంటుంది. వ్యవసాయదారులకు రుణాల వసతి వంటివి పొందగల అవకాశం వున్నది. వ్యాపార విస్తరణ, పెట్టుబడులపై లాభాలుంటాయి. ఉద్యోగ బాధ్యతల వల్ల శ్రమ పెరుగుతుంది. శుభకార్యాలలో పాల్గొంటారు. ఆరోగ్య భావం సరిగా ఉండదు.



## సింహం

(మఖ; పుబ్బ; ఉత్తర 1వ పాదం)

కొన్ని నిర్ణయాలు ఇబ్బందులు కలిగిస్తాయి. పనులు అనుకూలంగా సాగిపోతాయి. స్థిరాస్తులపై రావలసిన డబ్బు, బాడుగలు వంటివి ఆలస్యం కాగలవు. ఆరోగ్యం కూడా సరిగా ఉండదు. కండరాల, నరాల నొప్పులుంటాయి. ఉద్యోగస్తులకు అధికారులతో సన్నిహితం పెరుగుతుంది. ప్రయాణాలు అనుకూలించి కార్యసాధన జరుగుతుంది. శుభకార్యాలలో పాల్గొనడం, శుభకార్య నిర్ణయాలు జరుగుతాయి. ఆర్థిక పరిస్థితి బాగుంటుంది. అనుకోని శుభవార్తలు వింటారు. కుటుంబ సౌఖ్యం, విద్యాప్రగతి బాగుంటుంది. వారాంతంలో కుటుంబ ఖర్చులు పెరుగును.



## కన్య

(ఉత్తర 2,3,4పాదాలు; హస్త;చిత్త1,2పాదాలు)

వృత్తి, వ్యాపార రంగాలలో ఆదాయం బాగుంటుంది. వ్యవసాయదారులు ఆర్థిక ఇబ్బందులు పడతారు. అప్పులు, బాకీల పరిష్కారం కావచ్చును. నిర్మాణాలు రిపేర్ల వంటివి చేపట్టుతారు. కొత్త వ్యాపార అవకాశాలు లభిస్తాయి. తండ్రివర్గ బంధువులకు ఆరోగ్యం బాగుండదు. విద్యాప్రగతి బాగుంటుంది. ఉద్యోగులకు అధికారుల వేధింపులుండవచ్చును. ప్రభుత్వం నుండి రావలసిన బాకీలు నిలబడి పోవచ్చును. కుటుంబ సౌఖ్యం బాగుంటుంది. ఉద్యోగావకాశాలు లభిస్తాయి. శుభకార్యాలలో పాల్గొనడం, కొత్త వస్తువులు కొనడం జరుగుతుంది.

### పంచాంగం

**ముహూర్తములు**

3 తేది ఆదివారం ఉదయం గంట 8.28 లకు కన్యాలగ్నాన వివాహ, వ్యాపారారంభాలకు 7తేది గురువారం ఉదయం 8.04 గంటలకు కన్యాలగ్నాన వ్యాపారారంభాలకు, వివాహాలకు సుముహూర్తములున్నవి.

**సెప్టెంబరు తిథులు**
**భాద్రపద శుద్ధ**

తేది 2శని చతుర్థి ఉ10.30గం.వ
తేది 3 ఆది పంచమి ఉ10.10గం.వ
తేది 4 సోమ షష్ఠి ఉ 10.24 గం.వ
తేది 5మంగ సప్తమి ఉ11.05గం.వ
తేది 6బుధ అష్టమి ప 12.20గం.వ
తేది 7 బేస్త నవమి ప 1.55 గం.వ
తేది 8 శుక్ర దశమి ప 3.50 గం.వ

స్వయంపాకుల శ్రీనివాసులు, ఎం.ఏ.



## తుల

(చిత్త 3,4పాదాలు, స్వాతి, విశాఖ1, 2, 3 పాదాలు)

అనుకున్న పనులు సరిగా జరుగక ఇబ్బందులు పడతారు. ఆర్థికంగా అసంతృప్తి ఉంటుంది. వృత్తి, వ్యాపార, వ్యవసాయ రంగాలలో ఆదాయం తగ్గుతుంది. వ్యవసాయ నష్టం రావచ్చును. ఉద్యోగులకు విధి నిర్వహణలో గుర్తింపు, అధికార వర్గ సహకారం ఉంటుంది. పనులైతే సానుకూలం కాగలవు గాని ఫలితం ఆలస్యమౌతుంది. శుభకార్యాలలో పాల్గొంటారు.



## వృశ్చికం

(విశాఖ 4 పాదం, అనూరాధ, జ్యేష్ఠ)

వృత్తి, వ్యాపార, సాంస్కృతిక రంగాల వారికి ఆదాయం అభివృద్ధి బాగుంటుంది. వ్యవసాయ రంగాలలో నష్టాలుండగలవు. వారం ప్రారంభంలో ఆరోగ్యం లోపిస్తుంది. బంధువుల శుభకార్యాలలో పాల్గొనడం, ప్రయాణాలుంటాయి. ఆలోచనలు నిదానంగా అమలులో పెడ్తారు. ఉద్యోగులకు అధికారుల సహకారం బాగుంటుంది.



## ధనుస్సు

(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1పాదం)

కుటుంబ వ్యవహారాలు, ఉదరకోశ రుగ్మతల వంటి బాధలుంటాయి. వారం ప్రారంభంలో మనస్త్రిమితం సరిగా ఉండదు. బిడ్డల వల్ల ఖర్చులు పెరుగుతాయి. ఆర్థికపరమైన లావాదేవీ లలో తగాదాలు రావచ్చును. వృత్తి, వ్యాపారపరంగా ఆదాయం బాగుంటుంది. అనుకున్న పనులు మరో విధంగా జరిగే పరిస్థితు లుండవచ్చును.



## మకరం

(ఉత్తరాషాఢ 2,3,4 పాదాలు, శ్రవణ, ధనిష్ఠ 1,2 పాదాలు)

ఆరోగ్యం సరిగా ఉండదు. స్థిరాస్తుల సంబంధమైన పేచీలు, ప్రభుత్వం నుండి రావలసిన ఆదాయం నిదానంగా జరుగుతు కొనసాగుతాయి. వృత్తి, వ్యాపార రంగాలలో ఆదాయం బాగుంటుంది. వ్యవసాయ రంగంలో నష్టం రావచ్చు. ఉద్యోగులకు అధికారుల వేధింపులుండవచ్చును.



## కుంభం

(ధనిష్ఠ 3,4 పాదాలు, శతభిష, పూర్వాభాద్ర 1,2,3 పాదాలు)

కుటుంబ సౌఖ్యం బాగుంటుంది. స్థిరాస్తులపై ఆదాయం బాగుంటుంది. ఉద్యోగార్థులకు అవకాశాలు లభిస్తాయి. బంధుమిత్రుల ఇబ్బందులు, అనారోగ్య వార్తలు వింటారు. వారం ప్రారంభంలో డబ్బుకు ఇబ్బంది కలిగి తదుపరి సర్దుకొంటుంది.



## మీనం

(పూర్వాభాద్ర 4పాదం, ఉత్తరాభాద్ర, రేవతి)

వృత్తి, వ్యాపార, పారిశ్రామిక రంగాలలో ఆదాయం బాగుంటుంది. ఇంటా బయటగల సమస్యలు సర్దుకుంటాయి. ఆర్థిక పరిస్థితి బాగుంటుంది. స్థిరాస్తులపై ఆదాయం పెరుగుతుంది. ఆత్మీయులైన బంధువులకు అనారోగ్య బాధలుండవచ్చును. అనుకున్న పనులు ఆటంకాలతో జరుగుతాయి. అధికారులను గమనించుకొని ఉద్యోగ బాధ్యతలు నిర్వహించుకొనాలి.

# జనవాణి

3వ పేజీ కొరవ

క్లాబుల స్థానే 6 శ్లాబులు పెడ్తే - మధ్య తరగతి వారికి కాస్త ఊరట కలుగుతుంది. అందరికీ మేలు జరుగుతుంది.

గూడూరు వి.వి.ప్రభాకరరావు

## బస్సు షెల్టర్లు నిర్మించండి

నెల్లూరు టౌన్‌లో పెరుగుతున్న జనాభాకు అనుగుణంగా సౌకర్యాలు పెరగాల్సింది పోయి తగ్గిపోతున్నాయి. టౌన్‌లో దరిదాపులు 200 టౌన్ బస్సులు వేదాయపాళెం నుంచి నవాబుపేట వరకు వివిధ రూట్లలో నడుస్తుంటాయి. ముఖ్య సెంటర్లైన వేదాయపాళెం, ఆర్టీసి, మద్రాస్ బస్టాండ్, నవాబుపేట సెంటర్, సర్వేపల్లి కాల్వ బ్రిడ్జి, బాలాజీ నగర్, ఎసి నగర్, ఎన్టీఆర్ నగర్, రైల్వే స్టేషన్ల వద్ద ప్రజలు బస్సుల కోసం ఎదురు చూసేందుకు షెల్టర్లు లేవు. దీనివల్ల ఎండాకాలంలో ఎండల్లో, వర్షాకాలంలో వర్షంలో తడుస్తూ ప్రజలు బస్సుల కోసం ఎదురు చూడాల్సి వస్తుంది. పై ప్రాంతాల్లో షెల్టర్లు కట్టించే విషయమై స్వచ్ఛంద సంస్థలు, ప్రజాప్రతినిధులు తగిన కృషి చేయాల్సిన అవసరం వుంది.

నెల్లూరు వి.పట్టాభిరామయ్య

## సరైన వారిని ఎన్నుకోండి

ఎట్టకేలకు పంచాయతీ ఎన్నికలకు రంగం సిద్ధమవుతుంది. గత పంచాయతీ ఎన్నికలలో గెల్చిన సర్పంచ్‌లు ఎక్కువ భాగం తమ సంపాదన మీద దృష్టి కేంద్రీకరించి, వారి బంధువులకు ఎక్కువ భాగంగా కాంట్రాక్టు పనులు ఇచ్చుకొన్నారు. గెలిపించిన ఓటర్లకు మాటలతో ఎగనామం పెట్టారు. నిక్కచ్చిగా వున్న సర్పంచ్‌లు తక్కువ సంఖ్యలో వున్నారు. పంచాయతీలే ప్రజాస్వామ్యానికి పట్టుగొమ్మలు గనుక రేపు జరిగే పంచాయతీ ఎన్నికల్లోనైనా విద్యాధికులను, గ్రామ అవసరాలను తీర్చే అభ్యర్థులను ఎన్నుకొంటే బాగుంటుంది.

కుల్లూరు సాధు కృష్ణప్రసాద్

## వ్యాపారస్తులు తెలివిగలవాళ్లు

తూనికలు కొలతల శాఖ గూర్చి జమీన్‌రైతులో వ్రాసింది చదివాను. నేను 1988 నుంచి వినియోగదారుల హక్కుల రక్షణ కోసం కృషి చేస్తున్నాను. తూనికల కొలతల శాఖాధికార్లతో కలసి నేను పలుదాడుల్లో పాల్గొన్నాను. కాని ఎసి కూరగాయల మార్కెట్, ట్రైకసరోడ్ చేపల మార్కెట్‌లో వ్యాపారస్తులు తెలివిగలవాళ్లు. ఈ శాఖాధికారులు వస్తున్న విషయం ముందుగా తెలుసుకొని జాగ్రత్త పడిపోతున్నారు. తూనికలు కొలతల శాఖ ప్రభుత్వ శాఖల్లో కాపగ్రస్తమైన శాఖ. అధికారులు ఎక్కడికైనా వెళ్లను వాహన వసతి లేదు. సిబ్బంది కొరత, దీని వల్ల ఈ శాఖ కునారిల్లుతుంది.

నెల్లూరు అరిగెల రాజేశ్వరమ్మ

## మహిళల సీట్లలో పురుషులు?

ఆర్టీసి బస్సుల్లో ప్రత్యేకంగా ఎనిమిది సీట్లు మహిళలకు కేటాయించారు. ఈ సీట్ల వెనుక స్త్రీలకు కేటాయించనట్లు వ్రాసి తెలుగుదేశం పార్టీ చిహ్నమైన పసుపురంగు కూడా వేసి వుంటారు. కాని వాస్తవంగా ఈ సీట్లలో మహిళలు కూర్చోవడం లేదు. పురుషులే కూర్చొంటున్నారు. చిన్న బిడ్డల తల్లులు, గర్భిణీస్త్రీలు, వృద్ధ మహిళలు వచ్చిన సమయంలోనూ ఖాళీ చేసి ఇవ్వడం లేదు. కండక్టర్లు, డ్రైవర్లు ఈ వ్యవహారాన్ని మౌన ప్రేక్షకుల మాదిరి చూస్తున్నారు. మహిళలు ధైర్యంగా మగవాళ్లను తమ సీట్లలోంచి లేపి కూర్చొంటేగానీ వారికి న్యాయం జరుగదు.

నెల్లూరు ఎస్. రామమోహన్‌రెడ్డి

## వరద బాధితులను ఆదుకోవాలి

రాష్ట్రంలో కురిసిన భారీ వర్షాల వల్ల వేలాది మంది ప్రజలు నిరాశ్రయులయ్యారు. లక్షలాది ఎకరాల్లో పంటకు నష్టం సంభవించింది. వందల గ్రామాలు జలమయమయ్యాయి. కేంద్ర వ్యవసాయ శాఖా మంత్రి వచ్చి పర్యటించి వెళ్లారే తప్ప, ఇంత వరకు కేంద్ర సహాయాన్ని ప్రకటించలేదు. కరవు సమయంలో సైతం కేంద్ర ప్రభుత్వం రాష్ట్ర ప్రజలను ఆదుకోలేదు.

నెల్లూరు కె.కల్యాణ్

# 50 ఏళ్లక్రితం

3వ పేజీ కొరవ

గారి స్వర్గారోహణకు మెట్లు పెట్టగలవు.

## ఫైర్ సర్వీసు

దర్గామిట్ట యక్సయిజు బంగళాకు మారింది. ఆ ప్రక్కనున్న యానాదిమేస్త్రీ పుదూరు వెంకట సుబ్బయ్యను గత ఆదివారం నాడు అనవసరంగా చెయ్యి చేసికోని ఈ సర్వీసు వ్యక్తులు కొందరు నెత్తురు ఒలికేట్టు పడగొట్టారట. ఉపకారం చేయవలసి వారు అపకారానికి దిగడం విచారకరం. తదధికారులు విచారించి, మందలించి కట్టుబాటులో పెట్టుదురుగాక.

***

కనిగిరి వ్యసాయ శాఖాధికారి బండిపట్టాలు విషయంలో విత్తనాల ధాన్యం విషయంలో సక్రమంగా ప్రవర్తించలేదని ఒక ఫిర్యాదు వస్తున్నది. అక్కడి జిల్లా బోర్డు మెంబరు మాలకొండారెడ్డి గారు ఈ విషయమేమిటో విచారించి సరైన ప్రకటన చేయవలసినదిగా మేము కోరవచ్చునా?

***

అల్లూరు పేటలో శ్రీపుతి అల్లంపాటి కామమ్మగారు కట్టించిన కోదండ రామస్వామి హాస్టలు, కల్యాణ మంటపములు ప్రారంభోత్సవం 16-8-50తేది కలెక్టర్ బి. జోగప్పగారిచే జరుపబడింది. మృదుల మనస్కులు రేబాల దశరథరామిరెడ్డి గారు నాటి సభకు అధ్యక్షులుగను - రసజ్ఞులు తూములూరు వెంకట శివరామయ్య పంతులు గారు - సరస కవులు మోచర్ల రామకృష్ణయ్య గారు ఉపన్యాసకులుగ విచ్చేసిరి. తేనీటి విందా నంతరం సభ కార్యక్రమం జరిగింది. రాత్రి శ్రీ బొజ్జా కృష్ణమదాసు గారిచే హరికథ రసవంతంగా చెప్పబడింది.

***

కాంగ్రెస్ పాటల రచయిత నెల్లూరు మండల కాంగ్రెస్ గోత్రీయుల చరిత్రా రచయితగు శ్రీ మాన్ పార్థసారథి అయ్యంగారి షష్టిపూర్తి మహోత్సవం గత 15తేది శాస్త్రోక్తంగా జరిగింది. ఉపకారార్థం మరొక 60 సంవత్సరాలు దీర్ఘాయుష్మంతుడవై జీవించమని పెద్దలు ఆశీర్వదించిరి. చిరంజీవ, చిరంజీవ, సుఖీభవ, సుఖీభవ!

***

టవున్‌లో ఆయుర్వేద ఆసుపత్రి పేరు శ్యామయ్యంగార్ ఆసుపత్రి అని నామకరణం చేయవలెను. ప్రజలు ఇది వరకే చేసియున్నారులేండి.

-విమర్శకుడు

***

## నెల్లూరుసంగతులు

4వ పేజీ కొరవ

పాటు జనరేటర్‌ను ధ్వంసం చేశారు.

బంద్‌కు కాంగ్రెస్ నాయకులు సి.వి.శేషారెడ్డి, పసల పెంచలయ్య, దేవకుమార్‌రెడ్డి, మునిసిపల్ వైస్ ఛైర్మన్ సందానిబాషా, మునిసిపల్ కౌన్సిలర్లు,సిపిఎం నాయకులు మోహన్‌రావు, వారు కృష్ణయ్య, నరహరి, సిపిఐ నాయకులు దశరథరామయ్య, వేదాచలం నాయకత్వం వహించారు.

### కేసులు ఉపసంహరించాలి

పెంచిన విద్యుత్ ఛార్జీలు ఉపసంహరించాలని 'ఛలో అసెంబ్లీ' కార్యక్రమంలో పాల్గొన్న వామపక్షాల నేతలపై ప్రభుత్వం పెట్టిన కేసులను ఉపసంహరించాలని ముస్లిం హక్కుల పరిరక్షణ సమితి జిల్లా ఆర్గనైజింగ్ సెక్రటరీ ఎం. ఇలియాజ్ బేగ్ కోరారు. ఎమ్మెల్యే గుమ్మడి నర్సయ్య, సిపిఐ రాష్ట్ర కార్యదర్శి సురవరం సుధాకర్‌రెడ్డి అరెస్ట్ చేసి 17 గంటల తర్వాత పోలీసులు తమకు ఇష్టం వచ్చిన సెక్షన్లతో కేసులు పెట్టడం దారుణమన్నారు. ఈ చర్య ప్రజాస్వామ్యాన్ని పరిహాసం చేసే విధంగా వుందని విమర్శించారు.

### నాఫ్తా వ్యాపారులు లైసెన్స్‌లు పొందాలి

భారత ప్రభుత్వం నాఫ్తా సరఫరా, అమ్మకం, నిల్వలపై నిషేధం విధించినందువల్ల ఈ వ్యాపారం చేసే వాళ్లు విధిగా లైసెన్సులు పొందాలని జిల్లా కలెక్టర్ కోరారు. లైసెన్సులు పొందగోరు వారు జిల్లా పౌరసరఫరాల శాఖాధికారికి దరఖాస్తు చేసుకోవాలని కోరారు.

### 304 సెక్షన్‌ను మార్చకూడదు

లారీల యాక్సిడెంట్ జరిగిన సందర్భాల్లో డ్రైవర్లపై బనాయించే 304ఎ సెక్షన్‌ను మార్చకూడదని ఆంధ్రప్రదేశ్ లారీ ఓనర్ల అసోసియేషన్ రాష్ట్ర అధ్యక్షుడు పి. గోపాల్ నాయుడు కోరారు. ఈ సెక్షన్ బనాయించిన డ్రైవర్‌ను లారీ యజమాని తన పూచీకత్తుపై స్టేషన్ నుంచి విడుదల చేయించ వచ్చున్నారు. ఇటీవల రాష్ట్ర ప్రభుత్వం 304ఎ సెక్షన్‌ను సవరించి కేంద్ర ప్రభుత్వం ఆమోదం కోసం పంపించిన్నారు. సవరించిన చట్ట ప్రకారం డ్రైవర్‌కు బెయిల్ తీసుకొనేందుకు వారం రోజుల టైం పడుతుందన్నారు. బెయిల్ ఇవ్వడమనేది కూడా జడ్జి గారి విచక్షణ మీద ఆధారపడి వుంటుందన్నారు. నూతన సవరణల ప్రకారం డ్రైవర్ తప్పులేకున్నా జరిగే ప్రమాదం కేసుల్లో 2 సంవత్సరాల నుంచి 7 సంవత్సరాల వరకు శిక్ష అనుభవించాల్సి వస్తుందన్నారు. ఈ చట్టం వల్ల డ్రైవర్ల కుటుంబాల పోషణ లారీ యజమానుల మీద పడడమేగాక డ్రైవర్లు డ్యూటీని నిరాకరించే పరిస్థితులు ఏర్పడతాయన్నారు. ఈ సెక్షన్ సవరణకు ముఖ్యమంత్రి అడ్డుకోవాలని గోపాల్ నాయుడు కోరారు.

### అక్రమ కేసులు బనాయిస్తున్నారు

29తేది జరిగిన రాష్ట్ర బంద్ సందర్భంగా కలెక్టరేట్‌పై అమరవీరులకు సంతాపంగా, పోలీసు కాల్పులకు నిరసనగా నల్లజెండా ఎగురవేస్తే దాన్ని అడ్డంపెట్టుకొని తనపై అక్రమ కేసులు బనాయించాలని అధికారులు చూస్తున్నట్లు పిసిసి మాజీ సభ్యుడు కోటంరెడ్డి శ్రీధర్‌రెడ్డి చెప్పారు. 30తేది సాయంత్రం ఇందిరాభవన్‌లో ఏర్పాటు చేసిన విలేఖరుల సమావేశంలో మాట్లాడారు. నల్లజెండాను నేనే ఎగురవేశాను. నాకు తెలిసిన చట్టం ప్రకారం ప్రజాస్వామ్యంలో ఈ విధంగా చేయడం తప్పుకాదు. జై ఆంధ్రా, అస్సాం గణపరిషత్ జరిపిన వుద్యమాల్లో ఈ విధంగా నల్లజెండాలు ఎగురవేశారు. ఇది తప్పు, చట్ట వ్యతిరేకమని అధికారులు భావించి ఖచ్చితమైన కేసును బనాయిస్తే న్యాయం కోసం ఒక పౌరుడిగా కోర్టుకు వెళతాను. కాని ప్రభుత్వ ఒత్తిళ్లకు లొంగి ఈ విషయాన్ని వక్రీకరించి తప్పుడు కేసులు బనాయిస్తే గాంధేయ పద్ధతుల్లో పోరాటం చేస్తానన్నారు. ఈ పోరాటానికి నైతిక మద్దతు ఇవ్వాలని ప్రజలను అన్ని రాజకీయ పార్టీల నాయకులను, కార్యకర్తలను శ్రీధర్‌రెడ్డి కోరారు. ఈ వ్యవహారమై నాల్గవ పట్టణ ఎస్ఐ శివప్రసాద్ తాను ఇంట్లో లేని సమయంలో 29తేది రాత్రి తన ఇంటికి వచ్చి తనపై దేశ ద్రోహం కేసును నమోదు చేస్తామని తన కుటుంబ సభ్యులను బెదరించినట్లు శ్రీధర్ రెడ్డి చెప్పారు.




స్వర్గీయ నవయుగం దశరథరామయ్య కుమారుడు లక్ష్మీశ, ఉషశ్రీ వివాహం ఆగస్టు 6 తేది నెల్లూరులో జరిగింది.

### పతాకావిష్కరణ

భారతీయ పోస్టల్ ఎంప్లాయీస్ యూనియన్ నేతృత్వంలో ఎ.కె.నగర్ పోస్టాఫీసు నందు పతాకావిష్కరణ కార్యక్రమం జరిగింది. పతాకాన్ని యూనియన్ అధ్యక్షుడు కె. వెంకటేశ్వర్లు ఆవిష్కరించి సంఘం పోస్టల్ వుద్యోగుల సంక్షేమానికి చేపడుతున్న చర్యలను వివరించారు. ఈ కార్యక్రమంలో సంఘ నాయకులు రామయ్య, సత్యనారాయణ, సాంబశివరావు, మోహన్‌రావు, ఎ.మల్లి తదితరులు పాల్గొన్నారు.

### ఆలయాల ఇఓల కార్యాలయం

ది నెల్లూరు డిస్ట్రిక్ట్ ఎండోమెంట్స్ డిపార్టుమెంట్ ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్స్ అసోసియేషన్ కార్యాలయాన్ని ఆరణి కందప్ప మేస్త్రి సత్రంలో 25తేది గుంటూరు దేవాదాయశాఖ డిప్యూటీ కమీషనర్ జి. లక్ష్మణ ప్రారంభించారు. ఈ కార్యక్రమానికి ఏపి ఎన్జీఓ అసోసియేషన్ కార్యదర్శి సుధాకర్ ప్రసాద్ ముఖ్యఅతిథిగా విచ్చేశారు. అసోసియేషన్ నాయకులు దామోదరం, రవీంద్రరెడ్డి, రమణయ్య, రాఘయ్య, యానాదిశెట్టి తదితరులు పాల్గొన్నారు.

### దిగిన కిక్కు

4వ పేజీ కొరవ

నిర్వహణ పేరుతో మునిసిపాలిటీపై అదనపు భారం విధించకుండా, పరిమిత ఖర్చుతో పొదుపు పాటించాలన్నారు. మునిసిపాలిటీలో 15 మంది మహిళా కౌన్సిలర్లు వున్నందున వారికి ఒక ప్రత్యేక విశ్రాంతి గదిని కూడా ఏర్పాటు చెయ్యాలని సిపిఎం కౌన్సిలర్లు కోరారు. మునిసిపాలిటీలోవున్న ప్రత్యేక రాజకీయ పరిస్థితిని దృష్టిలో వుంచుకొని, గ్రూపులకు అతీతంగా నిష్పక్షపాతంగా నిబంధన ప్రకారం కమీషనర్ నడచుకోవాలని కోరారు. ప్రకటనపై సంతకం చేసిన కౌన్సిలర్లలో షేక్ దిల్షాద్, చాన్‌బాషా, పి. చంద్రారెడ్డి, పి. చెంచులక్ష్మి, వున్నం బసవయ్య, షేక్. రియాజ్ వున్నారు.

### వరద నీళ్లు

4వ పేజీ కొరవ

ఆత్మకూరు మండలంలోని బండారుపల్లి గ్రామం జల దిగ్బంధంలో చిక్కుతుంది. వీర్లగుడిపాడు, కోవూరు మండలంలోని వసంతతోపు నెల్లూరుటౌన్ వెంకటేశ్వరపురంలోని జనార్ధనరెడ్డి కాలనీలతోపాటు నదికి ఇరువైపులా గల మరో 40పైగా గ్రామాల్లో నీళ్లు ప్రవేశించాయి.

వాస్తవంగా సోమశిల ప్రాజెక్ట్ పూర్తి సామర్థ్యం 78 టిఎంసిలు; కాని భూసేకరణకు నిధులు అంతంత మాత్రంగా విడుదల చేస్తుండడంతో 37 టిఎంసిల నీటిని నిల్వ చేయడమే కనాకష్టమై పోతుంది. దీనివల్ల కోట్లాది రూపాయల పంట పండే అవకాశాన్ని చేజేతులా నాశనం చేసుకోవాల్సి వస్తుంది. జీరోబేస్‌డ్ బడ్జెట్‌లో సోమశిలకు కొంత మొత్తంలో నిధులు కేటాయించడం వల్ల 40 టిఎంసిల నీటి వరకు నిల్వ చేసుకొనే అవకాశాలున్నట్లు సీనియర్ నీటిపారుదల శాఖాధికారులు చెబుతున్నారు. ప్రాజెక్టుల అభివృద్ధికి కేంద్ర ప్రభుత్వం ప్రత్యేకంగా ఇస్తున్న నిధులకు రాష్ట్ర ప్రభుత్వం ప్రత్యేక గ్రాంటును జతచేసే ఆర్థికస్థితి లేనందున ఆ నిధులు ఉపయోగించుకొనే అవకాశమే లేకుండా పోయింది. జిల్లా ఎమ్మెల్యేలు ఈ విషయం పట్టుబట్టి కేంద్ర ప్రభుత్వం ప్రత్యేక పథకానికి మ్యాచింగ్ గ్రాంటు రాష్ట్ర ప్రభుత్వం చేత విడుదల చేయిస్తే, ప్రాజెక్ట్ సామర్థ్యం పెరగడంతో పాటు తద్వార వేలాది ఎకరాల్లో పంట విస్తీర్ణం పెరిగి జిల్లా ఆర్థికంగా అభివృద్ధి చెందుతుంది.



కలువాయి గ్రామంలో ఉచిత డయాబెటిక్ శిబిరాన్ని ప్రారంభిస్తున్న నెల్లూరు లయన్స్ క్లబ్ అధ్యక్షుడు ఇన్నమూరి ఉదయభాస్కర్‌రావు, ప్రక్కన డాక్టర్ యస్. సత్యనారాయణమూర్తి, క్లబ్ సెక్రటరీ ఎవిఆర్ మోహనరావు వున్నారు.

### చిత్రసమీక్ష

9వ పేజీ కొరవ

క్రింద అతను జైలు పాలవుతాడు. గీత ఆమె క్లాస్‌మేట్ అరవింద్ (జగపతిబాబు) కాలేజీలో ప్రేమించుకుంటారు. గీత అరవింద్ కోసం ఆ ఊరు వస్తుంది. అద్దె ఇంటి కోసం బాబు ఇంటికి వస్తుంది. గీత బాగా ఎదిగిపోయి వుండటంతో బాబు ఆమెను తన అక్కకూతురుగా గుర్తు పట్టలేక పోతాడు. బాబు తను వున్న ఇంట్లో సగ భాగం గీతకు అద్దెకిస్తాడు. ధర్మ జైలు నుంచి వచ్చి గీతను చూచి ఆమె మీద మోజుపెంచుకుంటాడు. గీత వివాహిత అని బాబు చెప్పటంతో ధర్మ ఆ ప్రయత్నం మానుకుంటాడు. గీత తన అక్కకూతురేనని బాబుకు నిదానంగా తెలుస్తుంది. అరవింద్ ఆమెను ప్రేమించాడని తెలిసి మొదట్లో బాబు బాధ పడతాడు. ఆ తర్వాత వారి ప్రేమ చెడగొట్టకూడదని తాను తప్పు కోదలుస్తాడు. గీత పట్ల బాబు చిన్న నాటి ప్రేమకు భంగం కలిగించకూడదని అరవింద్ తొలగి పోతాడు. బాబు గీత ఒకటవుతారు.

బలమైన బాబు పాత్రను శ్రీకాంత్ రక్తికట్టించాడు. గీతను తాను కోరుకున్న అరవింద్ దగ్గరకే చేర్చాలన్న ప్రయత్నంలో శ్రీకాంత్ నటన మెప్పుపొందుతుంది. బాబు, గీతల చిన్న నాటి ప్రేమ తెలుసుకొని వారిని కలపాలన్న ప్రయత్నంలో అరవింద్ పాత్రలో జగపతి బాబు వ్యక్తం చేసిన త్యాగం గొప్పగా వుంది. రంభ రాణించింది. పొన్నాంబలం హాస్యాన్ని ఒలకపోశాడు ఇక ఆలస్యమెందుకు ఈ చిత్రాన్ని చూసొద్దారండి.

### భామను

9వ పేజీ కొరవ

రంగాల్లో వున్నవాళ్లు ఎలా పరిశ్రమిస్తారో, అక్కడా అందరూ అలాగే పరిశ్రమిస్తారు. అటువంటప్పుడు అక్కడ వారిపై కామెంట్ చేయడం, జోక్స్ వేయడం అసమంజసమంటుంది రంభ.

### సినిమా

9వ పేజీ కొరవ

దని వాదించేదాన్ని. అయితే సినిమా పరిశ్రమకు వచ్చాక నా ఆలోచలన్నీ మారిపోయాయంటుంది సాక్షి శివానంద్. ప్రొద్దున్నే నిద్రలేవగానే దేవుడికి దణ్ణంపెట్టు కోవడం మొదలెట్టాను. దీనికి కారణం ఏమిటంటే - మన జీవితం మన చేతిలో లేదన్న విషయం గ్రహించడమే. అందుకే జాతకం కూడా చూపించుకొని దాని ప్రకారం 'నీలం' రాయి ఉంగరం పెట్టుకొన్నాను. దీనివల్ల కూడా కలిసొచ్చింది. అందువల్ల ఈ వ్యవహారాలపై నమ్మకం పెరింగదన్నారు.

### మళయాళ పరిశ్రమకు నష్టం

కన్నడ కంఠీరవ రాజ్‌కుమార్‌ను గంధపు చెక్కల స్మగ్లర్ వీరప్పన్ కిడ్నాప్‌తో కన్నడ పరిశ్రమలో ఏర్పడిన ప్రతిష్టంభన ఇంకా కొనసాగుతున్నది. పరిశ్రమకు రోజుకు మూడున్నర కోట్ల రూపాయల నష్టం జరుగుతుంది. చిత్ర నిర్మాణాలేకాక, చలన చిత్రాల ప్రదర్శనలు కూడా మూతపడిపోయాయి. కన్నడ చిత్రాలేగాక, ఇతర భాషల చిత్రాలు కూడా కర్నాటకలో ప్రదర్శితం కావడంలేదు. టీవి చిత్రాల నిర్మాణం, ప్రసార నిషేధాల వల్ల నష్టం రోజుకు 75లక్షలవరకుంది.

### నేదురుమల్లి

2వ పేజీ కొరవ

కేటాయించడానికి నిధులు లేవని తెలియచేశాడు.

ఆంధ్రప్రదేశ్‌లో ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ టూరిజం అండ్ ట్రావెల్ మేనేజిమెంట్ సంస్థ స్థాపన విషయంలోనూ ఇటువంటి సమాధానమే వచ్చింది. ఆంధ్ర ప్రదేశ్‌లో ఈ సంస్థను రాష్ట్ర ప్రణాళికలో స్థాపించుకొమని [illegible] ఇచ్చిందట కేంద్రం - టూరిజం మంత్రి అనంతకుమార్ చెప్పారు.

## స్పీకర్

మొదటి పేజీ కొరవ

అధికార పరిధిలో దుర్మార్గం చేసినా ప్రశ్నించలేని బలహీన పరిస్థితిలో స్పీకర్ వుండడం చాలా విచారకరం. స్పీకర్ అంటేనే పోలీసుకు భయం పోతే ఇక సామాన్య ప్రజల మాట ఏమిటి? ఇళ్లలోకి దూరి ఎటువంటి అత్యాచారం చేసినా అడిగే వారు, అడిగితే వినే వారు ఎవరు వుంటారు?

ఎమ్మెల్యేలు 11 రోజుల పాటు నిరాహార దీక్ష చేస్తే స్పీకర్ ఒక్కసారి కూడా మర్యాద పూర్వకంగా వారి యోగ క్షేమాలు విచారించలేదనే విమర్శ విస్తృతంగా వుంది. ఇంకొక ప్రక్క ప్రతిరోజూ శాసన సభలోపల స్పీకర్ అధికార పార్టీ వారికి ప్రాధాన్యత ఇస్తున్నారని, తమ గొంతులు నొక్కుతున్నారని ప్రతిపక్ష నేతలు ఆరోపిస్తున్నారు. స్పీకర్ పదవిలో వుండే వారు నిష్పక్షపాతంగా వుండడమే కాదు, వున్నట్లు ప్రజలకు అర్థమయ్యే రీతిలో ప్రవర్తించాలి. స్పీకర్ పదవి ఇంతగా వివాదాస్పదం కావడం శాసన సభకు అగౌరవం. ప్రతిభా భారతి గారు ఈ విషయం గుర్తించడం అవసరం.

## తేజ టివి

మొదటి పేజీ కొరవ

మద్రాసు ముఖ్యమంత్రి కరుణానిధితో సంప్రదించి, జెమిని టివి అధినేత మారన్‌కు విజ్ఞప్తి చేశారు. అయితే మారన్ సైతం ముఖ్యమంత్రి మాట చెవిపెట్టలేదు; పైగా మొత్తం సంఘటనలు రికార్డు చేసి రెండవ పర్యాయం ప్రసారం చేశారు. టివి ఛానళ్ల మీద ప్రభుత్వ అదుపు లేక పోవడంతో చంద్రబాబు కోరిక నెరలేదు. ఈ టివి మాత్రం ముఖ్యమంత్రి అభీష్టం మేరకు ఈ సంఘటనల ప్రసారం తలపెట్టలేదు.

## రక్తమడుగు

మొదటి పేజీ కొరవ

వారు సొమ్మసిల్లి పడిపోయారు. పోలీసులకు, ఆందోళనాకారులకు మధ్య రాళ్ల యుద్ధం జరిగింది. ఆ తర్వాత బాష్పవాయువు పేల్చారు; జనం చెల్లాచెదురై పోయారు. ఇది టివిలో మనకు కన్పించిన దృశ్యం. కాని ముఖ్యమంత్రి మాత్రం ముందుగా టియర్ గ్యాస్, వాటర్ క్యానన్‌లు వాడి అవి అయిపోయిన తర్వాత తుపాకులు పేలిక తీశామని చెప్తున్నారు.

రాష్ట్ర చరిత్రలో ఎన్నోసార్లు పోలీసులు కాల్పులు జరిగాయి కాని, ఇంత మానవతారహితంగా కాల్చింది ఎప్పుడూ లేదు.

దీనితో కథ ముగియలేదు. బషీర్‌బాగ్ దగ్గర జనం ఖాళీ అయిన తర్వాత పోలీసు రాక్షసులు ఓల్డ్ ఎమ్మెల్యే క్వార్టర్ల దగ్గరకు వెళ్లారు. అక్కడ జనం చాలా కొంచెం మంది మాత్రమే; వారు కూడా ఎమ్మెల్యేలను పలకరించడానికి వచ్చిన వారు. కాని పోలీసులు వారి మీద కూడా విరుచుకపడ్డారు; చితక తన్నారు. ఈ స్థలానికి, అసెంబ్లీకి చాలా దూరం. వీరు అసెంబ్లీకి వెళ్లాలన్న ప్రయత్నమే చేయలేదు. అటువంటి వారిని కొట్టవల్సిన అవసరం ఎందుకు వచ్చిందో చంద్రబాబుకే ఎరుక. మరి అభ్యంతరకరమైన విషయం! సిపిఎం నేత రాఘవులు చెయ్యి విరగ్గొట్టడం ; సిపిఐ నేత సురవరం సుధాకర్‌రెడ్డిని పట్టి పుణ్యానికి అరెస్ట్ చేసి హత్యానేరం మోపి జైలు పాలు చేయడం. ఈ ఇద్దరు నాయకులు చేసిన తప్పు ఏమిటో ఎవరికీ తెలియదు. మరొక సిపిఎం(ఎల్) శాసనసభ్యుడికి కూడా చెయ్యి విరిగింది. అతడ్ని ఆస్పత్రిలో చేర్పించవల్సింది పోయి ఒకరోజంతా పోలీసు స్టేషన్‌లలో తిండి, నీళ్లు లేకుండా వుంచి, ప్రక్క రోజు కోరుకు హాజరు పర్చారు. మేజిస్ట్రేట్ ఆదేశం ఇచ్చేవరకు విరిగిన చేతికి కట్టు కట్టించలేదు. దాదాపు ముప్పైఆరు గంటల సేపు ఆ ఎమ్మెల్యే బాధతో ఆక్రందన చేస్తుంటే ఆనందంగా చూశారు పోలీసు అధికారులు. ఇక్కడ మనకు అర్థమయ్యేది ఒక్కటే- ప్రదర్శనకారులను భయపెట్టి, భీతావహ పరిస్థితి సృష్టించి, ముందు ముందు వీరెవ్వరూ మరే ప్రదర్శన చేపట్టకుండా చెయ్యాలన్న దురుద్దేశం తప్ప- ఈ పోలీసు కాల్పులకు, ఈ దౌర్జన్యాలకు, ఈ రాక్షసత్వానికి మరొక కారణం కన్పడదు. పోలీసు బలగాన్ని ఇంత క్రూరంగా ప్రతిపక్షాలను అణిచివేయడానికి ఎమర్జెన్సీ రోజులలో ఇందిరాగాంధీ సైతం వాడలేదనడం నిజం. మొత్తం ప్రణాళికలో తన ప్రమేయం వుండబట్టే తను చెప్పినట్లు పోలీసు అధికారులు, పాశవికతను జనంపైకి ప్రయోగించబట్టే చంద్రబాబు ఈ సంఘటనలపై న్యాయ విచారణకు సిద్ధపడలేక పోతున్నాడు. ప్రదర్శకారులతో తీవ్రవాదులు వస్తున్నారని వారం ముందు నుంచే అల్లరి ప్రారంభించాడు చంద్రబాబు. దాని వుద్దేశ్యం ప్రదర్శనలో తాను చేయించబోయే పోలీసు దౌర్జన్యాలకు కుంటిసాకు వెతకడం తప్ప మరేమీకాదు. ప్రదర్శన మొత్తాన్ని ప్రభుత్వం వీడియో తీయించింది. కాని వారిలో ఒక్క తీవ్రవాదిని గుర్తించినట్లు పోలీసులు చెప్పడం లేదు.

ప్రభుత్వ విధానాలకు నిరసనగా ప్రదర్శనలు చేయడం ప్రజాస్వామ్యంలో సాధారణ విషయం. రాష్ట్ర చరిత్రలో ఇంతకంటె పెద్ద ఉద్యమాలు, ఇంతకంటె పెద్ద ప్రదర్శనలు పలు మార్లు జరిగాయి. ఛలో అసెంబ్లీ కార్యక్రమం కూడా ఇప్పటికి ఎన్నిసార్లు జరిగిందో లెక్కలేదు. కాని ఏ ప్రభుత్వం కూడా ఇంత అమానుషంగా ప్రవర్తించ లేదు. ఇంత దారుణంగా ప్రజలను చంపలేదు.

ప్రదర్శన కారులపై పోలీసులు చేసిన అత్యాచారాల ఫలితం అనుభ వించవల్సిన వాడు చంద్రబాబు నాయుడు మాత్రమే. శాసన సభలో తనకు మెజార్టీ వుంది కాబట్టి ఆయన సమాధానం చెప్పకుండా, విచారణ జరిపించకుండా, పోలీసుల మీద చర్య తీసుకోకుండా తప్పించుకోగలిగాడు; కాని జనం దృష్టి నుంచి మాత్రం తప్పించు కోవడం సాధ్యం కాదు.


మాగుంట సుధాకర్ రెడ్డి కుమారుడు కిరణ్, బొల్లం వాసిరెడ్డి కుమార్తె స్వాతిల వివాహం ఆగస్టు 8 తేది సికింద్రాబాద్‌లోని ఇంపీరియల్ గార్డెన్స్‌లో వైభవంగా జరిగింది.





Edited, Printed and Published by N. Dolendra Prasad at Zaminryot Press. Ph: 091-861-327354, Offset Printing at Zaminryot Press, Nellore.